సరస్వతీ గ్రంథమండలి

# దున్నేవాడిదే భూమి

(నాటిక)

బి. వి. యస్. పాత్రుడు



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరం

# DUNNEVADIDE BHOOMI

(A Play)

(Story adopted from "Struggle against Counter Struggle" a Play written by Mr. LI-CHIH HUA)

by

**B. V. S. PATRUDU, B.A (Dip) S. S. A.**

*Lecturer, Andhra University*

**1st Edition - September 1960 - Price nP. 75**





**Publishers: ADDEPALLY & CO.**

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.)

# తొలి పలుకు

చిరంజీవి బాయన వెంకటస్వామి పౌత్రుఁడు ఆదరంతో పంపిన "దున్నే వాడిదే భూమి" అనేనాటిక స్థాలీపులాకంగా చూడగల్గాను. సంతోషం. సహజత్వాన్ని కోల్పోనీయక యాదార్థ్యాన్ని ప్రతిఫలింపఁజేయటానికి చిన్నినాటిక ఉపకరిస్తుం దనుకుంటాను. యుగంవెంబడి యుగం తరలుతూంటుంది. అందులో భూస్వామియుగం అంతరించి రైతుయుగం వచ్చినతరవాత రైతుకు స్థానం లేకుండా ఏమవుతుంది? స్థానాన్ని చక్కగా చిత్రించి కాలం మారినతరవాత కూడ ఆలోచనలు మారకపోతే మరేమవుతుంది? విలయానికి దారితీయడమేగా! దేశ క్షేమాన్ని కోరాలంటే దున్నేవారికే భూమిహక్కు ఇవ్వడం మంచిది. దీనినే ఇతడు పారలోకాని కందించాడు. ఇతను కేవలం విశ్వకళాపరిషత్తులో ఉపన్యాసకుఁడేకాదు. ఆంధ్రదేశంలో సాంఘిక రాజకీయ విషయములమీద నాసక్తిఁజూపి శంఖారావముల నినుమడింపఁజేసిన బాలవీరుఁడు. స్వాభావిక సన్నివేశాల్ని సమకూర్చడం నటకుడికేగదా బాగాతెలిసేది! పౌత్రుని నాటిక ఔత్సాహిక సమాజాలచే వేయించడమేగాక నేను నటించడంవంటి భాగ్యం అబ్బింది. వీరొసంగిన అమూల్య సందేశాలు శంఖారావాల్లగా మారుమ్రోగుతుంటాయని ఆశిస్తున్నా!

రాజమండ్రి
15 – 9 – 60

పసుమర్తి పార్వతీశం

---

అంకితం

స్వర్గీయ మాతృదేవికి

బాయన ముకుందమ్మకు

## పాత్రలు

| | |
|---|---|
| సుబ్బయ్య | భూస్వామి. వయస్సు 50 సం॥లు |
| లక్ష్మయ్య | గ్రామరైతుసంఘ అధ్యక్షుడు. వయస్సు 30 సం॥లు. |
| లక్ష్మి | లక్ష్మయ్య భార్య. వయస్సు 25 సం॥లు. |
| సీతన్న | రైతు వయస్సు 62 సం॥లు. |
| రాజన్న | గ్రామ రైతుసంఘ ఉపాధ్యక్షుడు. వయస్సు 40 సం॥లు. |
| వెంకటస్వామి | గ్రామ రక్షణదళాధిపతి. వయస్సు 29 సం॥లు |

| | | |
|---|---|---|
| రామన్న | వయస్సు | 59 సం॥లు. |
| గవరయ్య | ,, | 32 సం॥లు. |
| లచ్చన్న | ,, | 40 సం॥లు. |
| వెంకటాద్రి | ,, | 30 సం॥లు. |
| తాతయ్యలు | ,, | 26 సం॥లు. |
| ముసలయ్య | ,, | 47 సం॥లు. |
| పెదకాపు | ,, | 42 సం॥లు. |

ఇంకా ఇతర గ్రామస్థులూ, రైతులూ మొదలైనవారు.

# " దున్నేవాడిదే భూమి "

కాలం:—సంధ్యాసమయందాటినతరువాత.

స్థలం:—ఒక పల్లెటూరు.

దృశ్యం:—తెర ఎత్తగానే ఒక గుడిసె కనబడుతుంది. గుడిసెకి ఒకపక్క తలుపు, కిటికీ ప్రేక్షకులకు కన్పిస్తూఉంటవి. గుడిసెముందు వంట కట్టెల మోపు ఒకటి ఉంటుంది.

ఆకాశం నిర్మలంగా ఉంటుంది. చంద్రుడూ, తారకలూ ప్రకాశిస్తుంటవి.

గుడిసెలోని దీపం మిణుకు, మిణుకుమని కన్పిస్తుంటుంది. దూరాన కుక్కల అరుపులు వినబడుతుంటాయి.

అడుగుల్లో అడుగులు వేసుకుంటూ గుడిసెకు వెనుకభాగంనుండి నక్కి నక్కి సుబ్బయ్య వస్తూంటాడు. కట్టెల మోపుదగ్గరకు వచ్చేసరికి ఆగి, గుడిసెలో ఏంజరుగుతుందో కిటికీలోనుంచి చూడబోతాడు. ఇంతలో కిటికీ మూతపడుతుంది. ద్వారం తీసుకుని "లక్ష్మి" బయటికి వచ్చి మరో వేపు వెళ్ళబోతూ సుబ్బయ్యని చూస్తుంది. ఆకస్మికంగా జరిగిన ఈసంఘటన వల్ల సుబ్బయ్య హఠాత్తుగా లక్ష్మికంట పడతాడు. సుబ్బయ్య తొట్రుపడతాడు. దారిని పోతూన్నట్లు నటిస్తూ, ఆమెను సమీపిస్తాడు.

సుబ్బయ్య:—ఏం లక్ష్మీ ! ఎక్కడికి వెడుతున్నావు ?

లక్ష్మి:—దొడ్లో ధాన్యం దంచుతూ, దంచుతూ ఇప్పుడే బయటికి వస్తున్నా !

సుబ్బయ్య:—వెన్నెలవెలుగులో ధాన్యందంచడం హాయిగా ఉంటుంది. శ్రమ అనిపించదు. లక్ష్మయ్య ఇంట్లోలేడా యేం?

లక్ష్మి:—కోడికూసేయేళకి పొలానికిపోతాడయ్యా ! చుక్కలొడిచే యేళకైనా ఇంటికిరాడు. ఎప్పుడూ రైతులగోడుతోనే

పొలాలంట కాలంగడుపుతూ ఇల్లూ, వాకిలీ ఊసే మెత్తడుగందా ! గోల !

సుబ్బయ్య:—ఆ ! ఎంత రైతు సంఘానికి నాయకుడైనా ఇంటిని చూడకుండా ఉండాలా లక్ష్మీ ! చెప్పేవాళ్లు లేకకాని...

లక్ష్మి:—ఏమోనయ్యా ! అతగాడి సంగతి నాకేమీ బోదకావడం లేదు.

సుబ్బయ్య:—అయితే ఇప్పుడు ధాన్యందంచడం ఎందుకు ? ఈ పూటవంటకేనా ?

లక్ష్మి:—ఇప్పటికొక్కడులే అయ్యా ! ఇంటిడు చాకిరీ నేనే చేయాలి గందా ! నీళ్ళుమోయడం, వంటచేయడం, పిల్లనిచూడడం, అంతా ఒక్కదాన్ని చేయాలి. అలాంటప్పుడు ధాన్యందంచడానికి పొద్దుగూకాక్కాని తీరిక ఎక్కడిది ! అబ్బ! రెక్కగూళ్ళు పడిపోతున్నాయయ్యా! కర్మమూ !

సుబ్బయ్య:—అంటే ఏమైనా అనుకుంటావేమో, కాని లక్ష్మీ ! జీవితంలో ఆనందం అనుభవించడం నీకు చేతకాదు. మీ ఆయన రైతుసంఘఅధ్యక్షుడవునా! మరి నువ్వు ఏం చెపితే ఏంజరగదు ? నీ మాటంటే అందరూ తలమీ దెట్టుకుని రెక్కలుకట్టుకుని చేస్తారే! ఎందుకీ బాధ ?

లక్ష్మి:—ఏమోనయ్యా ! కాని ఇతగాడు అలాంటిమాట సెవి నెట్టడు. "రైతుసంగానికి పెద్దైనంతమాత్రంచేత రైతు లంతా మనకి బానిసలంటే ?" అని గద్దిత్తాడు. మొన్న పొలంలోని దాన్నెం తోలించుకోద్దామని లచ్చన్న బండికి కబురుచెయ్యమంటే "రైతాంగం అంతా దాన్నెం

తెచ్చాక ఆఖరిని తెచ్చుకుందాంలే! ఇప్పుడేం తొందర?"
అన్నాడు. అదయ్యా అతగాడి వరస !

సుబ్బయ్య:—బాగుంది వరస ! తనకుమాలిన ధర్మం. ఇంతకీ నా బళ్ళన్నీ పట్నంపోయాయి లక్ష్మీ ! ఇంకా రాలేదు. లేక పోతే నాబళ్ళమీదే మిాధాన్యం తెప్పించి ఇంట్లో పోసే వాణ్ణి. సరే ! ఎప్పుడైనా ఆపని చేయగలనులే ! వస్తా మరి ! (సుబ్బయ్య కుడిప్రక్కనుంచి వెళ్ళిపోతున్నట్లు నటిస్తాడు.)

లక్ష్మి:—(అతడివంకే అనుమానంతో చూస్తూ) తియ్యావయ్యా; నీమీాదిమీాది తీపిమాటలు! పిల్ల ఏడుపు వినిపిస్తుంది. వెళు తూన్నదల్లా తిరిగివచ్చి, లక్ష్మి కిటికీచువ్వలమీాద చేతులు ఆనించి) ఉండమ్మా ! పాపా ! ఏడవకు. ఇప్పుడే వొచ్చి పాలుపడతాలే ! (పిల్ల ఏడుస్తూ ఉంటుంది) ఏంచావొచ్చిం దమ్మా ! (విసుక్కుంటూ ఎడమతట్టు వెళ్ళిపోతుంది.)

సుబ్బయ్య:—(కుడిపక్కనుంచి మెల్లిగా ప్రవేశిస్తాడు. లక్ష్మి వెళ్ళిపోవడం చూస్తాడు. తెల్లటి గుడ్డతో కట్టిన పొట్లం బొడ్డులోంచి తీస్తాడు. చేతులు వణుకుతవి. పొట్లం కిందపారేస్తాడు. పొట్లంలోని తుపాకీ గుళ్లు కిందపడిపోతవి. భయంతో అన్నిపక్కలాచూచి తొందరగా వాటిని ఏరి మళ్ళీ పొట్లం కడతాడు. ఊరుకున్నలక్ష్మికూతురు మళ్ళీ కేరుకేరుమని ఏడుపు మొదలెడుతుంది. సుబ్బయ్య ఉలికిపడ తాడు. తొందరగా ఆతుపాకీగుళ్ళపొట్లాన్ని కట్టెలమోపులో దాచే స్తాడు. విజయగర్వంతో నిలబడి గుడిసెవైపు చూస్తూ, పళ్ళుకొరు కుతూ) తస్సల్ చెక్కా ! అయిందిలే ! ఈదెబ్బతో మీజీవితాలు కూకటివేళ్ళతో కూల్తాయిలే ! (మీసాలు మెలివేస్తాడు. ఇంతలో ఎవరోవస్తున్న అడుగులచప్పుడు వినిపిస్తుంది. ఎడమపక్కగా సుబ్బయ్య మెల్లిగా జారిపోతాడు. పిల్ల ఏడుపు మానేస్తుంది.

లక్ష్మయ్యా బుజాన కాశీసంచి వేసుకుని కుడివైపునుండి ప్రవేశిస్తాడు. సీతన్న అతణ్ణి అనుసరిస్తూ వస్తాడు.)

సీతన్న:—లక్ష్మయ్యా ! సుబ్బయ్యా మనిషిలా నడుచుకోడం లేదయ్యా ! అతనిపొలాన్ని నేను సాగుచేశానా ! పంట చెరిసగం పంచుకోడానికి నిర్ణయం. కాని చూశావా నా సగపాలూ నాకు ఇవ్వడానికి ఇప్పుడు మొండిచెయ్యి చూపెడుతున్నాడు.

లక్ష్మయ్యా:—తొందరపడకు సీతన్నా ! అతనేవస్తాడు దారిలోకి. (తలుపు సమీపించి తెరవబోయాడు. తలుపురాదు.) ఓ ! తలుపు తాళంవేసి ఉంది. లక్ష్మి ఎక్కడకో బయటికి వెళ్ళినట్టుంది. సరే ! వచ్చేలోపల ఈవెన్నెట్లో కూచుని తీరికగా మాట్లాడుకుందాం, రావోయ్ !

(చతికలబడి, పైమీద తువాలుతో మొహం తుడుచుకుంటాడు అయితే; సుబ్బయ్యా ! ఏమన్నాడేంటి ?

సీతన్న:—ఏమన్నాడు, ఏమీలేదు. తొంటచెయ్యి చూపించాడు. (సుబ్బయ్యా గొంతుని అనుకరిస్తూ) "నాబళ్ళన్నీ పట్నం పోయాయి. నాధాన్యం అంతా ఇంకా పొలాల్లోనే ఉండి పోయింది. నీకింత తొందర దేనికి" అని.

లక్ష్మయ్యా:—అయితే నువ్వేమన్నావ్ ?

సీతన్న:—ఏమనడానికి ఏముంది ? 'పేదలకోపం పెదవులచేటే' కదా ! కోపం దిగమింగుకొని మాట్లాడకుండా వచ్చేసా నంతే !

లక్ష్మయ్యా:—బాగానేఉంది, ఏంమనిషి ! ఇంకా రైతాంగాన్ని మోసగిస్తున్నాడు. ఆనాడు మనం భూములు స్వాధీనం

చేసుకుంటున్నప్పుడు ఎంతో నక్క వినయాలు చూపి ఎన్నో వాగ్దత్తాలుచేశాడా ! కాని ఇంతవరకూ ఒక్కటీ నెరవేర్చాడా ? చూద్దాంగా ఎన్నాళ్ళో ఈ ఆటలు !

సీతన్న:—అంతా పైకి పెద్దకబుర్లు చెప్పేవాళ్ళే. కాని సుబ్బయ్య సంగతి వచ్చేసరికి ఒక్కరూ పెదవి కదల్చరు కదా! చచ్చిన పులిని చూచి కూడా జడుసుకునేరకం !

లక్ష్మయ్య:—అవును. మన తైతాంగం అంటే అతనికి పశువులతో సమానంలా ఉంది. ఒకసారి ఏంజరిగిందో తెల్సా! ఇతగాడి పొలాన్ని నేనూ దున్నాను. వరి కోయడం అయిపోయింది. ఇక కుప్పనూర్చడమే తరవాయి. రోజల్లా (శ్రమపడి) పొద్దోతే కూలీలు పని చెయ్యలేమని గోలకెత్తారు. అప్పుడేంచేశా డంటావు ! చడీ చప్పుడూ లేకుండా వెళ్ళి పోలీసుల్ని తీసుకువచ్చాడు !

సీతన్న:—నాకు తెలుసు ఆపోలీసుఅధికారీ వీడూ కుమ్మక్కు ! వాడో కటికిమనిషి ! మనిషిని చావమోదడం అంటే వాడికి వల్లమాలిన సరదా !

లక్ష్మయ్య:—ఆ పోలీసు అధికారి జాబుగా "ఏంరా వెధవల్లారా ! పనిచెయ్యకుండా ఏంచేద్దామనుకున్నార్రా ? భూస్వామి సుబ్బయ్యగారంటే ఏంటో తెల్సా ! నోరుమూసుకుని, ఆయనకాళ్ళమీదపడి, క్షమాపణ వేడుకొని పనిచేసి వెళ్ళండి" అన్నాడు.

సీతన్న:—ఆ వెధవకాళ్ళమీదపడి క్షమాపణవేడుకోమని ఈవెధవ చెప్పాడూ ?

లక్ష్మయ్య:—అవును. అంతటితో ఆగిందా! (కొరడా ఝుళిపించి) ఏంరా వెధవల్లారా! ఇంకా కాళ్ళమీదపడరేం! అని గద్దించగానే కూలీలు ఒక్కొక్కరూ భయపడి, సుబ్బయ్య కాళ్ళమీదపడి "బుద్ధిగడ్డితింది బాబూ. ఈతప్పుకాయండి" అని వేడుకొన్నారు. నేనుమాత్రం వొంగకుండా నిటారుగా నుంచున్నా. నన్ను చూచి పోలీసుఅధికారి "ఏంరా! కుక్కా నువ్వింకా కాళ్ళమీద పడవేం?" అన్నాడు. నేను ఏమీ మాట్లాడలేదు. కోపంతో వాడు నాదవడ మీద సాచి లెంపకాయ తీశాడు. ఆదెబ్బతో నాబుర్ర గిర్రున తిరిగి కళ్ళు పచ్చపడ్డాయి. ఏమైనాసరే అతగాడి కాళ్ళమీద పడనన్నాను. ఆ! నామాట కెదుర్చుచెపుతావా వెధవా! అని నడుముపటకాతీసి కొట్టడం ప్రారంభించాడు. "కాళ్ళుపట్టుకుంటావా, పట్టుకోవా?" అని కోపంగా గద్దించాడు. "బొందెలో ప్రాణండుండగా అలాంటిది జరుగ దయ్యా" అన్నాను. విసుగెత్తి పోలీసుఅధికారి, "సరే! నా తడాఖా చూపిస్తాలే" అని సుబ్బయ్యతో వెళ్ళి పోయాడు......

సీతన్న:—అబ్బా! ఎంత మొండిఘటానివి! సరేలే, నాసంగతేమి టిప్పుడు?

లక్ష్మయ్య:—మనమంతా ఏకమై అడుగుదాం. అతగాడు అప్పుడు దారిలోకి రాక ఏంచేస్తాడు. ఆబింకం అంతా మొన్న సడిలిపోయిందిలే.

సీతన్న:—ఏదైనా నువ్వేచేయాలి లక్ష్మయ్యా నాకుసాయం! నేను ముసలోణ్ణి అయిపోయానా? ఏంచెయ్యగలను చెప్పు.

(ఇంతలో లక్ష్మి, చేతిలో పాలగిన్నెతో ప్రవేశిస్తుంది.)

లక్ష్మయ్య:—ఇంతసేపూ ఎక్కడికిపోయావ్ ?

లక్ష్మి:—పిల్ల ఆకలితో గోలకెత్తుతూంటే పాపమ్మనడిగి పాలట్టు గొద్దామని పొయ్యా! (తాతవైపు చూస్తూ) ఏంతాతా! భోజనం అయిందా ?

సీతన్న:—అయిందమ్మా మేమిద్దరంకలసి సుబ్బన్న పెట్టేబాధలు సెప్పుకొని కష్టసుఖాలు వెళ్ళబోసుకుంటున్నాం.

లక్ష్మి:—గట్టిగా అరవబోకండయ్యా అతగాణ్ణి గురించి నేను సాల కెడుతుంటే, ఈదారినే అతగాడు యెన్నెట్లో సికారు సేస్తున్నాడు. మళ్ళీ ఈదారినే వొస్తాడేమో! అతగాడింటే అగ్గిమీద గుగ్గిలం అవుద్ది అతడి కోపం!

లక్ష్మయ్య:—వింటే విననీ. నిజం పలుకుతున్నప్పుడు భయపడ వలసిన అవసరం ఏముంది ?

లక్ష్మి:—ఇందాక ఇక్కడికి వచ్చి అతడు ఎంతో కనికారం కన పరచపోయాడు. తనబళ్లు లేవంట. ఉంటే మన దాన్నెం తానే మనింటికి తోలిపెట్టునంట !

లక్ష్మయ్య:—ఎంతవిషప్రేమ ! ఇలా నటించడంలోనూ, వేళకాని వేళ ఇక్కడికి రావడంలోనూ ఏదో మోసం బుద్ధిఉంది అతగాడి మనస్సులో. అవును కాని ఇంట్లో బియ్యం ఏమాత్రం ఉన్నాయి ?

లక్ష్మి:—నేను కొలవలేదయ్యా !

లక్ష్మయ్య:—అయినా చూద్దా !

(లక్ష్మి గుడిసెలోనికి వెడుతుంది)

లక్ష్మయ్య:—(సీతన్నతో) సంచితెచ్చా. తాతయ్యాలకు రెండు సేర్లబియ్యం పంపాలి. అందుకని లక్ష్మిని కొలవమంట ! (లక్ష్మిప్రవేశం) ఏం లక్ష్మీ ! ఈసంచిలో రెండుసేర్ల బియ్యం కొలుద్దూ ! పాపం తాతయ్యాలకు పంపాలి !

లక్ష్మి:—దంపి - దంపి, చచ్చానయ్యా ! ఇందులో దానాలూ ధర్మాలూ కూడానా ! ఉన్నవే మూడు కుంచాలు !

సీతన్న:—ఇతర్ల మంచిచెడ్డలు చూడ్డం మానవధర్మం లక్ష్మీ ! అం చేతనే లక్ష్మయ్యని గ్రామస్థులంతా పొగుడుతుంటారు !

లక్ష్మయ్య:—సీతన్నా ! అనవసరంగా పొగుడుతున్నావ్ నన్ను అతగాడు తిండికి లేక పిల్లలతో బాధపడుతున్నాడు. నాకు తోచిన సహాయం చేయదలిచాను. పాపం వాళ్ళిం ట్లోపాదీ కడుపులోకాళ్ళుపెట్టుకొని కాలక్షేపంచేస్తారీ రోజునే బియ్యం పంపకపోతే! అవసరంవచ్చినప్పుడు ఆదు కోకపోతే రైతుసంఘం ఎందుకు ? బీదవాళ్లు మనకళ్ళ ముందు మలమల మాడవలసిందేనా ?

లక్ష్మి:—సరే, మీయిష్టంవచ్చినట్టు కానీయండయ్యా ! నే నడ్డు రావడం ఎందుకూ ? త్వరగా భోజనానికిమాత్రం లేవండి మళ్ళీ సంటిపిల్ల లేచకుండా ! (సంచిపట్టుకొని లక్ష్మి లోప లికి వెడుతుంది.)

సీతన్న:—విన్నావా, లక్ష్మయ్యా ! సోమయ్యకొడుక్కి పట్నంలో ఉద్యోగం దొరికిందట. ఉత్తరం రాశాడట.

లక్ష్మయ్య:—అవును. ఆ ఉత్తరం పదేపదే చదువుకుని సోమయ్య తన ముసలిగెడ్డాన్ని ఆనందంతో నిమురుకున్నాడు.

పాపం ఉత్తరం రాయమాలనుకుంటాడు కాని అక్షరజ్ఞానం లేదు.

సీతన్న:—పట్నవాసంవాళ్ళకి చదువొస్తుంది కాని పల్లెప్రజలకి మన కేం వస్తుందయ్యా ! అయినా ప్రతివాడూ చదువుకో డానికి ప్రయత్నించాల్సిందే !

(రాజన్న ఒకనల్లటి కోటు తొడుక్కొని ఠీవిగా వస్తాడు.)

రాజన్న:—నిజమే సీతన్నా ! నువ్వన్నముక్క ! "విద్యలేనివాడు వింతపసు" వన్నారు మన పెద్దలు. అంతా చదువుకోవా లనే నాకోరికాను.

లక్ష్మయ్య:—చూడు సీతన్నా ! మన సంఘసభ్యుల్ని అందరినీ రామకోవిల చావిడిదగ్గిరికి రమ్మను. ఈలోగా మేము రామన్ననీ సుబ్బయ్యనీ పిలుచుకువస్తాం. అందరిఎదట తగువు పరిష్కరిద్దాం.

సీతన్న:—సరే ! (తనలో తాను ఏదో గొణుక్కుంటూ ముందుకి సాగుతాడు.)

రాజన్న:—ఆగు సీతన్నా ! ఒక్కక్షణం (ఏమీ తెలియనట్లు నటిస్తూ) ఏదో సణుక్కుంటూ న్నావేటయ్యా !

సీతన్న:—ఏముంది రాజన్నా ! మన భూస్వామిసుబ్బయ్యని గురించే......

రాజన్న:—(చప్పున అర్థంచేసుకున్నట్లు నటిస్తూ) ఓ అదా ! నీ ధాన్యం గురించా ? ఇంకా ఆయనధాన్యమే తోలించు కోలేదే ఇంటికి ! ఇంతలోనే అనుమానం ఎందుకు సీతన్నా అతగాడిమీద......

సీతన్న:—ఏమోబాబూ ! ఇంతలో వర్షాలు పడితే కళ్ళంలో ధాన్యం గంగపాలు కావలిసిందేగా !

రాజన్న:—నీకున్న రెండుమూడు గరిసెలకే ఇంత బాధపడితే వేలాది గరిసెలున్న సుబ్బన్నగారెంత బాధపడాలయ్యా! కొంచెం తాళు మరి !

లక్ష్మయ్య:—(తీక్షణమైనచూపులతో) రాజన్నా ! నువ్వా రైతు సంఘ ఉపాధ్యక్షుడివికదా ! నువ్విలా భూస్వామిపక్షం వహించి మాట్లాడడం న్యాయమా ? అవునులే మరి. ఆయనతో విందులారగిస్తూ మాపక్షాన ఎందుకు మాట్లాడతావ్ ?

రాజన్న:—ఆమాత్రానికే దెప్పడం దేనికయ్యా ! అసలుసంగతి తెలియకుండా......

సీతన్న:—లక్ష్మయ్యా! రైతుసంఘసభ్యులందర్నీ పిలవమంటావా ?

లక్ష్మయ్య:—ఊఁ ! పిలు ! ఆలస్యం దేనికి ?

రాజన్న:—ఒక్కక్షణం ఆగు సీతయ్యా !

లక్ష్మయ్య:—వెళ్ళనియ్యవయ్యా ! ఇప్పటికే చాలా ఆలస్యమైంది. మనంమాత్రం సుబ్బయ్యగారింటికి వెళ్ళి ఆయన్నిక్కడికి పిలుచుకురావద్దా...

రాజన్న:—ఆగవయ్యా ! అయితే ! అంతకంటే జరుగురువిషయా లున్నాయి. అవి మాట్లాడ్డానికే నేనిప్పుడు వస్తి !

లక్ష్మయ్య:—అయితే ఆ చెప్పదలచిందేదో శీతన్నతో చెపుతూండు. ఇంతట్లో నే భోజనంచేసి వస్తా.

రాజన్న:—చేద్దువుగానిలే భోజనం ! ముందు ఈసంగతి తేలనీ !

లక్ష్మయ్య:—ఏ సంగతి ?

రాజన్న:—ఆరోజు మన గ్రామంలోని జమిందారులవద్దనుండి భూము లన్నీ స్వాధీనంచేసుకున్నప్పుడు, సుబ్బయ్యగారి వ్యవహారం కూడా పరిష్కరించాం. ఆనాడు ఆయన్ని ఎదుర్కొన్నది నేనే. నువ్వు రైతుసంఘ నాయకుడుగా, నేను ఉపనాయ కుడుగా ఎన్నికలయాం. మన సంఘం గొప్పపనులు చేయలేకపోయినా, పాడుపనులుమాత్రం చేయలేదు ! ఒప్పుకుంటావా ?

లక్ష్మయ్య:—ఆమాట కాదన్నవా డెవడు ? అందుకే ఆనాడు ఈజమిందారుల దౌర్జన్యాలు అలా అరికట్టగలిగాం.

రాజన్న:—పదవిలో నువ్వు నాకన్న పెద్దవాడివి. అయినా, వయ స్సులో నాకన్న చిన్నవాడివి లక్ష్మయ్యా ! అంచేత నాకు తోచింది దాచుకోకుండా చెప్తున్నా విను. మనం రైతు సంఘం అభివృద్ధికి పనిచేయాలి. కాని వారిమంచికోసం పనిచేస్తున్నట్లు నటిస్తూ చెడ్డచేయడం చాలద్రోహం. (సీతన్నవైపు తిరిగి) ఏమంటావ్ సీతన్నా ! అంతేనా !

సీతన్న:—అంతేమరి.

రాజన్న:—(లక్ష్మయ్యతో)నువ్వు పడుచువాడివి. ఉరకలువేసే ఉద్రేకంలో ఆలోచించకుండా ఏదోపొరపాటు చేసేఉండొచ్చు.

లక్ష్మయ్య:—ఏమిటయ్యా ! ఈడొంకతిరుగుడు కథ ! నేను చేసిన తప్పు ఎమిటో సూటిగా చెప్పరాదూ !

రాజన్న:—తొందరపడకు లక్ష్మయ్యా! అంతా సవిస్తరంగాచెపుతా ఈసీతన్నముందే! కాని నువ్వు చేసినతప్పుని ఒప్పుకుంటే

నిన్ను కాపాడ్డానికి ప్రయత్నిస్తా! లేకపోతే తర్వాత నన్ను నిందించి ప్రయోజనంలేదు ! ఆలోచించుకో బాగా !

లక్ష్మయ్య:—ఏమిటి ఇదంతా అయోమయంగా ఉందే (తాతవైపు తిరిగి) చూశావా సీతన్నా ఇదంతా !

సీతన్న:—ఏంటో నాయనా ! బుర్ర బద్దలుకొట్టుకున్నా నాకేం అర్థం కావడంలేదు.

రాజన్న:-(లక్ష్మయ్యతో) ఏం నక్కవినయాలయ్యా ! పాపం ఏం తెలియడంలేదేం ? చేసిందేదో ఒప్పుకో ఇపాటికైనా !

లక్ష్మయ్య:—ఏమిటీ మాటలు రాజన్నా! నే నేదైనాచేస్తే దానికి బాధ్యుడను నేనే అవుతాను కదా ! మధ్య నీకెందుకీబాధ ? ఏదైనా ఉంటె చెప్పరాదూ !

రాజన్న:—వింటున్నావా సీతన్నా ఆమాటలు ! నానోట చెప్పించాలని చూస్తూన్నాడు లక్ష్మయ్య. అయితే వినవయ్యా మరి ! నువ్వు రైతుసంఘానికి ద్రోహంచేస్తున్నట్లు ఆకాశి రామన్నఉత్తరం వచ్చింది.

లక్ష్మయ్య:—ఏముంది ఆ ఉత్తరంలో ?—

రాజన్న:—నువ్వు రహస్యంగా జమిందారీముఠాతో సంబంధం పెట్టుకున్నావనీ, అవసరమైతే రైతాంగాన్ని నాశనంచేయడానికి ఇంట్లోనే తుపాకీరవ్వలు దాచావనీ......

లక్ష్మయ్య:—ఏమిటీ! తుపాకీరవ్వలా? రైతాంగాన్ని నాశనంచేయదలిచానా ? అన్యాయం ! అంతా ఓకట్టుకథ......

సీతన్న:—ఆవిషయం నేను చస్తేనమ్మను.

రాజన్న:-నువ్వు అడ్డంరాక సీతన్నా మధ్యని! (లక్ష్మయ్యవైపు తిరిగి) నిన్న చూడ్డానికి నిన్న మీ మావఁవచ్చాడా లేదా......

లక్ష్మయ్య:-అవును వచ్చాడు. వస్తే ?......

రాజన్న:-మీ మావఁ జమీందారులికి తల్లోనాలిక. అతడిద్వారానే అన్ని సంగతులూ నీకు తెలుస్తుంటవి. ఆ తుపాకీగుళ్ళు కూడ మీ మావేఁఇచ్చాడు కదూ ? జాగ్రత్తపెట్టమనీ...... ఇంకెందుకూ బుకాయింపులూ !......

లక్ష్మయ్య:-ఇదంతా పచ్చి అబద్ధం.

(లక్ష్మి ప్రవేశించి పక్కనుంచి అంతావింటూ హఠాత్తుగా)

లక్ష్మి:-మాఅయ్య అలాంటివాడు కాదయ్యా ! మాకేపున్నం పాపం తెలిదు రాజన్న బాబూ ! లేనిపోని వాదు వెయ్యకు మామీద !

లక్ష్మయ్య:-నువ్వాగు లక్ష్మీ. నీకెందుకీ గొడవ ! (రాజన్న వైపు తిరిగి) ఎవరన్నారు ఇదంతా చెప్పు? ఐసాపైసా తేల్చేస్తా!

రాజన్న:-ఎవరో నాకేంతెల్సు. ఆకాశరామన్న ఉత్తరంలో రాసి ఉంది ఇదంతా.

లక్ష్మయ్య:-ఏదీ ఆఉత్తరం ? ఇట్టా పడేయ్ !

రాజన్న:-ఇదుగో ఉత్తరం. (జేబులోంచి ఉత్తరంతీసి అందిస్తాడు)

లక్ష్మయ్య:-(ఉత్తరం పుచ్చుకుని) ఎవరిచ్చారీ ఉత్తరం నీచేతికి!

రాజన్న:-నాకేంతెలుసు ఎవరిచ్చారో !

లక్ష్మయ్య:-ఎవరూ ఇవ్వకపోతే ఉత్తరం నీకెలా చేరిందయ్యా ? దీనిమీద పోష్టుముద్ర లేదే !

రాజన్న:—నువ్వు నామాటలు నమ్ముతావో లేదో లక్ష్మయ్యా! రైతుసంఘకార్యాలయంలో నాకోటు వంకీనితగిలించి కాగితాలు చూసుకుంటూ, రైతులతో అటూ, ఇటూ తిరుగుతూ, ఇంటికివెళ్ళిపోదామని కోటుతొడుక్కొని వస్తున్నా. దాన్లోచుట్టకోసం జేబులో చేయిపెడితే ఈఉత్తరందొరికింది. వెంటనే ఏమిటా అని చదివా! చదివితే ఇదీసంగతి. ఈవిషయంలోని నిజానిజాలు ఏమిటో తేల్చుకోవాలని వచ్చా.

లక్ష్మయ్య:—అయితే! ముందే ఈవిషయం అంతా ఎందుకు చెప్పలేదు?

రాజన్న:—(తొట్రుపాటుతో) ముందా ... ముందు ... అవును చెప్పలేదు ఏమంత అవసరం అని......

లక్ష్మయ్య:—అయితే ఈ ఉత్తరంలోని విషయాలునిజం అని నువ్వు నమ్ముతావన్నమాట!

రాజన్న:—ఏమో! తుపాకీగుళ్లు ఇంకా నీయింట్లో నేను చూడలేదు కాబట్టి పూర్తిగా నిజం అనలేను. కారణంలేకుండా ఉత్తరంరాయడాని కెవడికి పట్టిందని? అంచేత అబద్ధం అనలేను.

సీతన్న:—అయితే చూసిందే నమ్ము. లేనిది మాను.

లక్ష్మయ్య:—రాజన్నా! ఈ గ్రామంలో చాలకాలంబట్టి ఉంటున్నానా! నేను కలలోకూడ గ్రామానికి ద్రోహం తలపెట్టానా? చేతనైతే మంచిచేసా లేకపోతే ఊరుకున్నా! నమ్మితే నమ్ము. లేకపోతే మాను.

లక్ష్మి:—మాఅయ్యకి ఉబ్బసరోగం. కర్ర ఊతలేకుండా గట్టిగా నాలుగడుగులు వేయలేడుకదా! చెవ్వుడూ, చత్వారమూ కూడా వచ్చింది. అలాంటి ముసిలాడు ఇలాంటి కానిపని ఎలాచేస్తాడు ! అసలు అతడికీ జమిందార్లకీ సంబంధమే లేదే ! ఇదేం వింత రాజన్న బాబూ !

(లక్ష్మయ్య, లక్ష్మి కొంచెం ఉద్రేకంగా మాట్లాడడంచేత చుట్టుపట్ల ఉన్న వెంకటస్వామి, రామన్నా, వెంకటాద్రి తదితరరైతులూ గుమికూడతారు. ఇలా వీళ్ళందరూ చేరినందులకు రాజన్న లోలోన సంతోషిస్తాడు.

రాజన్న:—నాకు మీపై ఏమైనా ద్వేషమా ? ఎందుకూ మీరంతా తబ్బిబ్బులైపోతున్నారు ? విషయం నిజమో, అబద్ధమో తేల్చుకుంటే తీరిపోతుందిగా !

(సుబ్బయ్య వెనుకనుంచి వచ్చి దూరంగా వింటూ నిలుచుంటాడు.)

వెంకటస్వామి:— మీ ఇద్దరూ రైతుసంఘ నాయకులు. ఇలా నడివీధిలో ఒకరిమీద ఒకరు దుమ్మెత్తిపోసుకుంటా రేమిటయ్యా ! సవ్యంగా మాటాడుకోక !

రామన్న:—పడుచువాళ్ళకి కోపం ముక్కుమీద ఉంటుందిరా ! (సీతన్నవైపు తిరిగి) మనలాంటి ముసిలివాళ్ళకి కోపం రాదు. వచ్చినా జుట్లుపట్టుకోలేం !

రైతులుఅంతా:—(ఒకేసారి) ఏమిటి సంగతి ? ఈగోల అంతా దేనికి ?

రాజన్న:— (ఆనందంతో) మీరంతా రావడం మంచిదయింది. లేకపోతే మీకందరికీ నేనే కబురుచేయాలనుకున్నా. ఈ గొడవ అంతా ఎందుకో చెప్తా ! (లక్ష్మయ్యవైపు తిరిగి) ఏమయ్యోయ్ ! నీమీద నాకేం ద్వేషం లేదు. యువకులు ఉద్రేకంలో తప్పులుచేయడం సహజం. ఆవిష

యం ఇంతమందిలో బయటపెట్టడం నాలాంటివాడికి భావ్యంకాదు. ఊరుకోమంటావా ?...

లక్ష్మయ్య:—ఈ సోదిఅంతా అనవసరం. నేను చేసిందేమిటో అందరికీ తెలిసేలా చెప్పేయ్ ! భయంలేదు.

రైతులుఅంతా:—(ఒకరితర్వాత ఒకరు) అవును. చెప్పాలి – చెప్పి తీరాలి.

ఒకరైతు:—(లక్ష్మయ్యవైపు తిరిగి) ఏంటి లక్ష్మయ్యా ఇదంతా ? పోనీ నువ్వేచెప్పకూడదూ సంగతేంటో !

లక్ష్మయ్య:—నాపైన ఎవరో ఆకాశరామన్న ఉత్తరం రాశారట ! నేనూ, మా మావాం జమిందారీముఠాతో సంబంధం పెట్టుకున్నామట. రైతాంగాన్ని నాశనంచేయడంకోసం తుపాకీగుళ్లు మాయింట్లో దాచానట. ఏదో వింతకథ చెపుతున్నాడు రాజన్న. ఇదంతా నమ్ముతారా మీరు ?

......

లక్ష్మి:—(ఆత్రుతతో) నిజాయితీకి ఈ చుట్టుపట్ల మానాన్న పేరెక్కినోడు. ఆయన ఎలాచేస్తా డీకుట్ర ? ఇవన్నీ రాజన్న మాయమాటలు.

లక్ష్మయ్య:—లక్ష్మీ నీకెందుకు నువ్వూరుకో ! వాళ్ళని మాట్లాడనీయ్.

వెంకటస్వామి:—నేను గ్రామరక్షణదళాధిపతిని. నాకు లక్ష్మయ్య సంగతి బాగా తెలుసు. అతడు ఇలాంటి నీచమైన ద్రోహానికి ఎంతమాత్రం ఒడిగట్టడు. అది నేనునమ్మను.

రామన్న:—లక్ష్మయ్యమావ ఈగ్రామంలో కొంతకాలం ఉన్నాడు. అతనంత మంచివాడు మరోడులేడని చెప్పాలి నిజానికి.

రైతులంతా:-లక్ష్మయ్యసంగతి మాకుబాగా తెల్సు. అత డిలాంటి పని చేస్తాడంటే మేం నమ్మం. ఎవడో కిట్టనివాడు నీలాప నింద మోపడానికి ఆ తప్పుడు ఉత్తరం రాసి ఉంటాడు.

రాజన్న:-మీకందరికీలాగే నాకూ లక్ష్మయ్యపట్ల మంచిఅభి ప్రాయం ఉంది. లేకపోలేదు ! ఎవడో ఆకాశరామన్న ఉత్తరం రాశాడు. అందులో నిజంఎంతో అబద్ధంఎంతో తెలుసుకోవద్దా. మీరే చెప్పండి ! తెలుసుకోవాలంటే మరి...మరి...ఇల్లు...

లక్ష్మయ్య:-అవును. తెలుసుకోవాలి. తెలుసుకొని తీరాలి. ఇల్లు సోదాచేయండి. అదొక్కటే నేను నిర్దోషినని రుజువు చేసే మార్గం.

లక్ష్మి:-అవును సోదాచేయండి. మేం నిరపరాధులం. ఎంతవెతికినా మీకేం దొరకదు.

రాజన్న:-(కోపంతో) నేనేం వ్యక్తిగతద్వేషంతో ఈపని చేయడం లేదమ్మా ! ఈపని నాసొంతంకాదు. రైతుసంఘ భవిష్యత్తు ఈవిషయంమీద ఆధారపడిఉంది. అందుకనీ నాగోలంతా...

లక్ష్మయ్య:-ఇంక ఈగొడవంతా అనవసరం. ఆలస్యంచేయకుండా సోదా ప్రారంభించండి. దయచేసి ఇక్కడ ఉన్నవారెవరూ వెళ్ళవద్దని నాప్రార్థన.

అంతా:-ఇదేదో తేలేవరకూ మేం వెళ్ళదలుచుకోలేదు.

రాజన్న:-(మొహం చిట్లించుకొని) సరే ! అలా అయితే సోదా చేయండి. (ఎవరూ సోదాచేయడానికి ప్రయత్నించరు.

కోపంతో) వెంకటస్వామీ ! ఈపని నీది. నా ఆజ్ఞ నువ్వెందుకు పాలించవ్ ? నీకుకూడా ఇందులో ఏమైనా...

వెంకటస్వామి:—చాల్చాల్లే ! ఆగు అంతటితో. నాబాధ్యతలు నాకు తెలుసు. గుడిసెపీకండి. నేలతవ్వేయండి. కాని లక్ష్మయ్యఇంట్లో ఏమీ దొరకదని నా నమ్మకం. సరే పదండయ్యా వెదుకుదాం !

(గదిలోకి వెంకటస్వామి వెళతాడు. అతనితో తక్కినవాళ్ళు వెదుతుంటారు.)

రాజన్న:— మీరంతా లోపలికెందుకయ్యా ! గవరయ్యా ! చూడు నువ్వా బయట వెదుకు.

(గవరయ్యా మొహం చెండుకొని బయటకట్టెలమోపుని తిరగేస్తూంటాడు. ఇంతలో అతడికి తెల్లటి పొట్లం కన్పిస్తుంది. ఇదే రాజన్నకు కావలిసింది) పొట్లంచూసి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ ఏమిటది ? ఏదీ నన్ను చూడనియ్.

(గవరయ్యా పొట్లం రాజన్నచేతిలో పెడతాడు. రాజన్న పొట్లం విప్పుతాడు. తుపాకీగుళ్ళు చూస్తాడు. లక్ష్మయ్యా నిలువునా స్తంభించిపోతాడు. చేరినవారైతాంగం ఒకరిపై ఒకరు పడి తుపాకీగుళ్లు చూస్తుంటారు. లోపలికి వెళ్ళిన రామన్నా, వెంకటస్వామీ గుడిసెలో నుంచి బయటికి వస్తారు. వారుకూడ తుపాకీగుళ్లు చూస్తారు.)

రాజన్న:—(వెంకటస్వామివైపు తిరిగి) ఊం ! చూడవయ్యా ఇవేమిటో !...

(ఇంతలో సుబ్బయ్యా వెనుకనుంచి ఏమీ తెలియనట్లు వస్తాడు. రాజన్న చేతిలోని తుపాకీ గుళ్లు పరీక్షిస్తాడు. తిరిగి గుళ్లు అతడిచేతిలో ఉంచేస్తాడు.)

సుబ్బయ్యా:—చాలా మంచిరకం తుపాకీగుళ్ళయ్యా ఇవి! ఇలాంటివి ఈరోజుల్లో దొరకడం కష్టం.

వెంకటస్వామి:—(గవరయ్యవైపు తిరిగి) ఇవి వంటకట్టెలమోపుల్లో దొరికాయి. అవునా!

గవరయ్య:—అవును.

రాజన్న:—(లక్ష్మయ్యవైపు తిరిగి) లక్ష్మయ్యా! నువ్వు రైతుసంఘ అధ్యక్షుడివి అయినా జమిందారీముఠాతో సంబంధం పెట్టుకున్నావ్. ఆకాశరామన్న ఉత్తరంపై చర్యతీసుకోక పోతే ఈపాపం అంతా బయటపడేది కాదు. నువ్విలాంటి ద్రోహంచేస్తావని నేననుకోలేదు. (గుంపువైపు తిరిగి) ఇతడికి ఏమిశిక్షవేయాలో చెప్పండి మరి ?......

గవరయ్య:—ఇలాంటిద్రోహం నేనెప్పుడూ చూడలేదు.

వెంకటాద్రి:—నమ్మించి గొంతుకోయ్యాలనుకున్నాడు.

రామన్న:—ఇలాంటి పాడుబుద్ధి పుట్టిందెందుకో ఇతడికి. శిక్ష మీరే ఆలోచించండి. అంతాకలిసి......

లక్ష్మి:—(ఆవేదనతో) రాజన్నా ! తప్పుచెయ్యలేదన్నా నమ్మే వారెవరు ? మేం నిరపరాధులం అని నిరూపించునేకు ఆధారంఒక్కటీ లేదు.

రాజన్న:—వంటకట్టెలమోపుల్లో దొరికినవి లేవనడం ఎట్లా ?

లక్ష్మి:—రాజన్నబాబూ! మా కేపాపం తెలియదయ్యా. నువ్వే మమ్మీ ఆపదనుండి కాపాడాలి.

(లక్ష్మి ఏడుస్తుంది. రాజన్న కాళ్ళమీద పడబోతుంది. ఇంతలో గుడిసెలో పిల్ల ఏడుపు వినబడుతుంది.)

లక్ష్మయ్య:—(భార్యపైపు తిరిగి) నువ్వింటికి పో! ఈ విషయంలో అనవసరంగా జోక్యం కల్గించుకోకు. ఎవరినీ ప్రాధేయ పడకు.

(లక్ష్మి గుడిసెలోకి వెళ్ళిపోతుంది.)

రాజన్న:—చేసిందిచాలక ఇంకా కోపందేనికయ్యా! వెంకటస్వామీ! లక్ష్మయ్యను బంధించు.

లక్ష్మయ్య.—అనవసరం. నువ్వు నన్ను పారిపొమ్మన్నా పోనయ్యా! ఎందుకూ భయం ?

రైతులంతా:—అతణ్ణి బంధించడం అనవసరం. అతగాడు పారి పోడని మేం హామీ ఇస్తాం.

రాజన్న:—ఇస్తారు! కాని అతడిమనస్సులో ఏముందో ఎవరు చెప్ప గలరు ? ఇంతకుముందే కదూ మీరంతా ఇతడింట్లో తుపాకీగుళ్ళు దొరకవని చెప్పారు. కాని ఏంజరిగింది ?

లక్ష్మయ్య:—సరే బంధించండి. నిజం నిలకడమీద తేలుతుంది.

రాజన్న:—గవరయ్యా ! ఇతణ్ణి బంధించి రైతుసంఘకార్యాల యంలో ఉంచి దట్టమైన కాపలాపెట్టు. ఇతడు పారిపోతే పీకలు ఎగిరిపోతాయని చెప్పు. మన రాష్ట్రరైతుసంఘా ధ్యక్షుడికి అంతా చెప్పి ఈసమస్య ఆయన పరిష్కారానికి విడిచిపెడదాం.

(లక్ష్మయ్యా గవరయ్యా కుడిపక్కగా వెళ్ళిపోతారు. సీతన్న కూడా వెళ్ళిపోతాడు. మిగతవా రొక్కక్కరూ వెళ్ళిపోతుంటారు.)

రాజన్న:—మీరెవరూ వెళ్ళవద్దు రండి రండి.

(కొందరు తిరిగివస్తారు.)

రామన్న:— మళ్ళీ ఎందుకయ్యా మేం అంతా ?

రాజన్న:—మనం అంతా ఇప్పుడు సమావేశం ఏర్పాటుచేయాలి. ఉండండి. వెళ్ళకండి.

రామన్న:—ఇప్పుడా ?

రాజన్న:—అవును.

వెంకటస్వామి:-ఏ సమావేశం?

రాజన్న:-రైతుసంఘ సమావేశం (వెంకటాద్రివైపు తిరిగి చూడు)నువ్వువెళ్ళి మనసభ్యుల్ని వెంటనే రమ్మని చెప్పు.

(వెంకటాద్రి వెళతాడు.)

వెంకటస్వామి:-మొత్తం అరవైకి పైగా సభ్యులున్నారు కదా, వెంకటాద్రి ఒక్కడే ఇంతమందిని ఎలాపిలవగలడు. ఇంకో క్కణ్ణి పంపడం మంచిది.

రాజన్న:-పిలుపందీ వచ్చినవాళ్ళు వస్తారు. రానివారికి రేపుకబురు చేసి విషయం అంతాచెపుతా.

(వెంకటస్వామి వెళతాడు. లచ్చన్నా, తాతయ్యలూ, మొదలైన రైతులూ, సుబ్బయ్యావస్తారు. లక్ష్మికూడ వస్తుంది.)

రాజన్న:-(లక్ష్మివైపు తిరిగి) ఆడవాళ్ళకి ఈసమావేశంతో సంబంధంలేదే! నువ్వు వెళ్ళవచ్చు.

(లక్ష్మి వెళ్ళిపోతుంది. వెంకటస్వామి దీపంతో ప్రవేశించి ప్రతిఒక్కడి మొహం చూస్తూంటాడు దీపాన్ని సుబ్బయ్య మొహంమీద పెట్టి చూడబోతాడు.)

రాజన్న:-ఏమిటి ఇదంతా?

వెంకటస్వామి:-మనసంఘానికి చెందని మనుష్యులున్నారేమో అని చూస్తున్నా! ఉంటే వాళ్ళని తరిమేస్తా!

రాజన్న:-(వెంకటస్వామిచేతిలోని దీపం ఆర్పేస్తాడు) వెన్నెల వెలుగులో అంతా బాగా కన్పిస్తుంటే దీపం దేనికయ్యా! ఆయన సుబ్బయ్యగారు. మనకు కావలిసినవారు.

వెంకటస్వామి:-అదే మరి ఇప్పుడు చెప్పుతున్నది. ఈయన మన రైతుసంఘసభ్యుడు కాడే. మన నిబంధనల ప్రకారం ఈయన......

రాజన్న:—మన సంఘనిబంధనలు ఇటీవల మార్పుచేసామయ్యా. ఉంపొచ్చు ఆయనిక్కడ......

వెంకటస్వామి:—అని నీఅభిప్రాయం అన్నమాట !

రాజన్న:—అదంతా అనవసరం. దీపం వెలిగించు.

వెంకటస్వామి:-ఇందాక నువ్వేకా అర్పుతా, మళ్ళీ వెలిగించమంటావ్ దేనికయ్యా ! (విసురుగా వెళ్ళిపోతాడు.)

రాజన్న:—వెన్నెలకాంతిలో వేళ ఎంతఅయిందో తెలియడంలేదు! దీపంకావాలి. ఆలస్యమౌతూంది.

(కొంతమంది రైతులు తిరిగివస్తారు. వెంకటాద్రికూడా వస్తాడు. వెంకటస్వామి దీపం వెలిగించి పట్టుకువస్తాడు.

వెంకటాద్రి:-రాజన్నా! అప్పుడే చాలమంది పక్కవేశారు. రాలేం అన్నారు.

రాజన్న:-ఇక వారువచ్చినా రాకపోయినా సమావేశం జరిగిపోవలసిందే.

(వెంకటస్వామి కోపంతో దీపం ఆర్పేసి వెళ్ళిపోతాడు.)

రాజన్న:-(లేచి గొంతు సవరించుకొని) అంతా శ్రద్ధగా వినండి. లక్ష్మయ్య రైతుసంఘాధ్యక్షుడు. కాని రహస్యంగా జమిందారీముఠాతో సంబంధంపెట్టుకొని రైతాంగంమీాద కుట్రలు పన్నుతున్నాడు. దీనికి ఈవేళ అతని ఇంట్లో దొరికిన తుపాకీగుళ్ళే నిదర్శనం. ఇది మనసంఘానికి తీరని ద్రోహం. అంచేత అతణ్ణి పదవినుండి తొలగించాలి. ఏమంటారు మీారంతా! (అంతా నిశ్శబ్దం) మీారంతా పిరికివాళ్ళలాగ అతగాడికి భయపడుతున్నారా? మాట్లాడరేం?

(సీతన్న మెల్లిగా చుట్టకాల్చుకుంటూ వస్తాడు.)

సీతన్న:—నే మాట్లాడతానయ్యా !

రాజన్న:-ఓ! దానికేం! మాట్లాడవయ్యా !

సీతన్న:-సుబ్బయ్యగారితో నేను ఒకఒప్పందం చేసుకున్నా. దాని ప్రకారం పంట చెరిసగం పంచుకోవడానికీ నాధాన్యం ఆయనబళ్ళతో నాయింటికి తోలించడానికీ నిర్ణయం. కాని ఇప్పుడు ఆయన అలా చేయడానికి నిరాకరిస్తున్నాడు. న్యాయమేనా ?

గుంపుఅంతా:-ఒప్పందంప్రకారం ఇచ్చితీరాల్సిందే! ఎవరు కాదంటారు ?

రాజన్న:-అనవసరంగా కేకలువేయకండి. ఈవిషయం తర్వాత పరిష్కరిద్దాం.

సీతన్న:-ఇప్పుడెందుకు కాకూడదు. అందరూ వచ్చారుగా ! అది కూడా తేల్చేయండి.

రాజన్న:-ముందావిషయం తేలాలి. దాన్నిగురించి నీవేదైనా చెప్పదలచుకొన్నావా ?

సీతన్న:—లేదు.

రాజన్న:-అయితే నువ్వుమాటాడక విను.

సీతన్న:—అలాఅయితే నేనిక్కడుండనే ఉండను.

(సీతన్న గొణుగుకుంటూ వెళ్ళిపోతాడు.)

రాజన్న:—లక్ష్మయ్య రైతులికి తీరనిద్రోహం తలపెట్టాడు.అంచేత అతణ్ణి పదవినుంచి తొలగించి ఆ స్థానే మరొకరిని ఎన్నుకోవాలి. మీరు ఎవరిపేరైనా చెప్పండి. మీకంతా ఇష్టమైతే ముసలయ్యని ఎన్నుకుందాం. ఏమంటారు?

ముసలయ్య:-రాజన్నా! నేనీ గ్రామంవచ్చి రెండేళ్ళయింది. రైతు సమస్యలేమిటో, గ్రామసమస్యలేమిటో నాకేం తెలియవు. నన్ను అధ్యక్షుడిగా ఉండమనడంకంటే మరొకరిని ఎన్నుకోవడంమంచిది. నాకెందుకుబాబూ ఈపదవి ?

రాజన్న:-నువ్వూరుకో ముసలయ్యా ! నీకెందుకు ? ఎవరూ మాట్లాడరేం ? ఏం చెప్పండి ? సమ్మతమేనా ?

రామన్న:-రాజన్నా ! తుపాకీగుళ్ళు లక్ష్మయ్యఇంట్లో దొరికినంత మాత్రంచేత అతగాడిని దోషిగా పరిగణించడానికి వీలు లేదయ్యా ! నేరాన్ని రుజువుచేయాలి. అతనిమీద కిట్టక ఎవరైనా ఈకానిపని చేసిఉండొచ్చు. నిజం తేలేవరకూ ఎన్నిక వాయిదావేయడం మంచిది.

రాజన్న:-వహ్వా! ఏంమాటలు! అతడియింటిదగ్గర కర్రలమోపులో తుపాకీగుళ్ళు దొరికితే ద్రోహి అతగాడుకాక మరెవరోయ్ ! (గుంపులో గుసగుసలు. లక్ష్మయ్యేచేశాడా మరి ఎవరైనా తుంటరి ఈపనిచేసాడా అన్నసందేహం రేకెత్తి గుసగుసలు జోరు అవుతవి.)

రాజన్న:-(క్రోధంతో) మీ గుసగుస లెందుకయ్యా! ముసలయ్య మీ కిష్టంలేకపోతే మరొకరిని ఎన్నుకుందాం వెంకటాద్రిని ఎన్నుకుంటే మంచిదని నాఅభిప్రాయం. ఏమంటారు?

వెంకటాద్రి:-రాజన్నబాబూ ! ఆపదవి నాకొద్దయ్యా !

రాజన్న:-నువ్వూరుకోవయ్యా! మీరంతా ఈ ఇద్దరిలో ఎవరినో మీకునచ్చినవారిని ఎన్నుకోండయ్యా! (అంతా నిశ్శబ్దం. ఎవరూమాట్లాడరు) ఏం ! ఎవరూమాట్లాడరేమయ్యా !

(సుబ్బయ్యవైపు చూస్తూ) అయ్యా! సుబ్బయ్యగారూ, తమరు ఇలా దయచేయండి. అంతా మీరు వింటున్నారు కదూ! మీఅభిప్రాయం ఏమిటో దయచేసిచెప్పండి. మీరంతా జాగ్రత్తగావినండి.

(అంతాఆశ్చర్యాన్ని ప్రకటిస్తారు రాజన్నగుంపువైపుతిరిగి)

సుబ్బయ్య:—(అందరికీ కన్పించేలా మధ్యకి వచ్చి నిలబడతాడు) అయ్యా! మీరంతాశ్రద్ధగావినండి. ఒకప్పుడు ఈగ్రామా నికి నేను తిరుగులేని నాయకుణ్ణిగా ఉండేవాణ్ణి. కారణాంత రాలచేత నాకున్నభూమిని రైతాంగం కోరికమేరకు స్వాధీనంచేసా. మీరంతా రైతుసంఘాన్ని ఏర్పరిచి రైతులహక్కులకోసం ఉద్యమాలునడుపుతున్నారు. ఇది చాలమంచిపని. భూస్వామిగానేను కొంతమంది కడుపులు కొట్టానని ఈనాటికీకూడా రైతాంగం నన్ను నిందిస్తున్న విషయం నాకుతెల్సు. కాని ఆవిషయం నేనంతగాపట్టించు కోను. గతాన్ని మరిచిపోండి. మనంఅంతా కలిసిమెలిసి ఈగ్రామంలో జీవించాలి. అంచేత నాకున్న మిగత ఆరు వందల ఎకరాలూ ఈరోజే మీస్వాధీనం చేసివేస్తా. నేనూ మీలో ఒకడిగా అయిపోతా! మీరేం ఇస్తే దానితోనే కాలక్షేపంచేస్తా! ఏమంటారు? మరోమాట. రైతుఉద్య మాలనువిచ్ఛిన్నంచేసే విద్రోహకశక్తులనన్నింటినీ నాశనం చేయాలి. లేకపోతే మనసంఘానికేముప్పు ముంచుకుంచు. రాజన్న సలహాను పాటించాలని నామనవి. ఆలోచించండి, మీరంతాబాగా!

రాజన్న:—బేష్. చాలాచక్కగా ఉంది. ఏమంటారు మీరంతా? చెప్పండయ్యా ఇప్పుడు సమాధానం—

(ఎవరూ మాట్లాడరు. కనీసం పొడిదగ్గు అయినా వినిపించదు.)

సుబ్బయ్య:—(ముందుకువచ్చి) ఒక్కమాట. నాకున్న ఆరువందల ఎకరాలూ, భూమిలేని రైతాంగానికి పంచిఇచ్చివేస్తా. గత సారి పంచినప్పుడు కొన్ని రైతుకుంటుంబాలకు భూమి దొరకలేదు పాపం. ఇప్పుడు వాళ్ళకూ్కడా సర్దుబాటు అవుతుంది.

రాజన్న:—సుబ్బయ్యగారి ఉదారత మెచ్చుకోతగింది. (రైతులను ఉద్దేశించి) అవకాశాన్ని జారిపోనీయకండి."దున్నేవాడిదే భూమి" అన్నసిద్ధాంతాన్ని ఆఖరికి సుబ్బయ్యగారు గుర్తించారు. భూదానంచేస్తున్నారు. భూమి రైతుహక్కును వారే అమల్లో పెడుతున్నారు. అంతా అంగీకరించండి. ఆరువందల ఎకరాలూ పంచేస్తున్నారు సుబ్బయ్యగారు. సుబ్బయ్యగారికీ జయ్ !

రైతులంతా:—అయితే ఒప్పుకుంటాం.

రాజన్న:—అయితే వెంకటాద్రిని ఎన్నుకోవడంమాట ఏమైనట్టు?

రైతులంతా:—ఎన్నుకుంటాం. అభ్యంతరం లేదు.

సుబ్బయ్య:—చూడండి ! నాకున్నభూమి అంతా మీస్వాధీనం చేస్తా. అలాంటప్పుడు మీరు నన్నూ, నాకుంటుబాన్నీ మలమలమాడుస్తారా చెప్పండి. కనక నాభూమి పంచుకున్నవారంతా సాలీనా మీపంటలో కొంతవంతు నాకిస్తే నాకుటుంబపోషణ జరుగుతుంది. ఏమంటారు చెప్పండి ?

రాజన్న:—ఆవిషయం మాకుమాత్రం తెలియదటండీ. ఇప్పుడు ఈగ్రామం అంతా రైతాంగానిది. ఈగ్రామంలో లోగ డలా ఇప్పుడు పస్తులతో మాడి చచ్చేప్రాణి ఉండకూడదు. ఇక ఈనాటి సమావేశ వివరాలు. రైతుబాంధవుడన్న లక్ష్మయ్య రైతాంగానికి వ్యతిరేకంగా జమిందారీ ముఠాతో చేతులుకలిపిన కారణంగా అతణ్ణి అధ్యక్షుపదవి నుంచి తొలగించి అతడిస్థానే వెంకటాద్రిని ఎన్నుకోడం జరిగింది. మీరంతా సమావేశంలో పాల్గొన్నందుకు నాధన్యవాదాలు.

(ఒక్కొక్కరూ వెళ్ళిపోతారు. సుబ్బయ్య వెళ్ళిపోయినట్లు నటించి ఎవరికీ కనిపించకుండా పొంచిఉంటాడు. లచ్చన్నా, రాజన్నా, వెంకటాద్రీ ఉంటారు. సమావేశం పూర్తిఅవడంచేత లక్ష్మి వస్తుంది.)

లక్ష్మి:—రాజన్నా! మాఆయన భోజనంకూడా చేయలేదయ్యా! భోజనం తీసుకువెడతా. ఒప్పుకోఅయ్యా !

రాజన్న:—సరే ! తీసుకువెళ్ళు.

(లక్ష్మి వెళుతుంది.)

వెంకటాద్రి:—రాజన్నా ! నన్ను అధ్యక్షుణ్ణిచేశా వేమిటి ? నాకు చదువూ సందెలూ రావుకదా !

రాజన్న:—బాధపడకయ్యా ! (నెమ్మదిగా) నే నున్నానుగా !

(వాళ్ళముందునుంచి లక్ష్మి భోజనం తీసుకువెడుతుంది.)

వెంకటాద్రి:—లచ్చన్నా ! నువ్వు ఒక్కమాటకూడా మాట్లాడ లేదేం ? నీకు భూమి అక్కర్లేదా ?

లచ్చన్న:—సుబ్బయ్య భూమా ?

రాజన్న:—అవును. అయితే ?

లచ్చన్న:—అక్కర్లేదు.

రాజన్న:—నాకు తెల్సు ఎందుకిలా నువ్వు మాట్లాడుతున్నావో. నీభార్యని సుబ్బయ్య ఒకప్పుడు బలాత్కారం చేశాడనే కదూ! గతాన్ని మరిచిపోవోయ్ వెర్రివాడా! వొచ్చే లాభాన్ని కాలదన్నుకోకు.

సుబ్బయ్య:-(దూరానపొంచిఉండి తనలో) తనభార్యకీ నాకూ జరిగినసంగతిగురించి ఇంకా మాట్లాడాడంటే, ఈవెధవని చిత్రవధచేయిస్తా! ఏమనుకున్నాడో! (మీసంమెలేస్తాడు.)

లచ్చన్న:—ఎలాఅయ్యా మరిచిపోవడం? తలుచుకుంటే కడుపు తరుక్కుపోతుంటే!

రాజన్న:-పిచ్చోడా! వెళ్ళు. చింతిస్తేమాత్రం చచ్చింది వస్తుందా? హాయిగా భూమితీసుకుని నిర్విచారంగా కాలంగడుపు. ఊఁ! త్వరగా వెళ్ళుమరి.

(లచ్చన్న వెళతాడు. రాజన్నా, వెంకటాద్రీ రంగంమీద ఉంటారు. ఇతరులెవరూ లేకపోవడం చూచి సుబ్బయ్య పొంచిఉన్న స్థలాన్ని విడిచి వస్తాడు.)

సుబ్బయ్య:-వెంకటాద్రీ! నీతో నాకంతగా పరిచయంలేకపోయినా నువ్వు నిజాయితీగలమనిషివని, నీచేతుల్లో రైతుసంఘం అభివృద్ధిచెంది తీరుతుందని ఆశిస్తున్నా!

వెంకటాద్రి:—ఏమిటో బాబూ! ఇదంతా నానెత్తిన పెట్టారు. ఈభారం మోయడం ఎలాగో ఏమిటో!

సుబ్బయ్య:—నీకేం భయంలేదయ్యా! మేం ఉన్నాంగా! చూడు! నాబంగళాలో అవసరమైతే మీ కార్యాలయం పెట్టుకో.

అన్నిఏర్పాటులూ నేచేస్తా. కానీ ఖర్చు నువ్వు పెట్ట క్కర్లేదు.

రాజన్న:—చాల బాగుంది.(వెంకటాద్రితో) ఈవేళే బల్లతగిలించు. మరివెళ్లు.ఒక్కమాట. లోగడ భూమి దొరకనివాళ్ళందర్నీ కార్యాలయం దగ్గరకిరమ్మను.

వెంకటాద్రి:—చెప్తుతా. రాకపోతే ఏంచెయ్యను?

రాజన్న:—నాదగ్గరికితీసుకురా వాళ్ళని.

వెంకటాద్రి:—అలాగే! (కుడిప్రక్కగా వెళ్తాడు.)

సుబ్బయ్య:-రాజన్నా! నువ్వు పెద్ద పొరపాటు చేశావోయ్!

రాజన్న:—పొరపాటా!

సుబ్బయ్య:—ఈబడుద్ధాయిని అందలంఎక్కించావ్ దేనికి?

రాజన్న:—ఇలాంటివాడైతేనే మనచెప్పుచేతల్లో ఉంటాడు. అన్నింటికీ మనపై ఆధారపడతాడు. అదీ కిటుకుతెలిసిందా!

సుబ్బయ్య:—ఓహో! అదా! బాగుంది. నాకా ఆలోచన పోనే లేదు.

రాజన్న:—అయితే, సుబ్బయ్యగారూ! ఆతుపాకీగుళ్ళు ఎలా...

సుబ్బయ్య:—ఇక్కడటయ్యా ఆవిషయం? అది మరొక్కప్పుడు మాట్లాడుకొందాం. సరే నువ్విప్పుడు రాష్ట్రైతుసంఘా ధ్యక్షుడిదగ్గిరికి వెళ్ళి మాట్లాడాలి.

రాజన్న:—నేనూ ఆవిషయమే అనుకుంటున్నాను. రేపే వెళ్ళివస్తా!

సుబ్బయ్య:-సరే, జాగ్రత్త! (చెవిలో) మాటల్లో మనకుట్ర ఏమాత్రం బయటపడకూడదు సుమా! వెంకన్న దేవాంత కుడు. ఆవులిస్తే పేగులు లెక్కేస్తాడు.

రాజన్న:—ఆవిషయమై మీరేమీ ఆదుర్దాపడనవసరంలేదు. నేను నాటకంఅంతా చక్కగా ఆడానుకదా! ఇంకెందుకు భయం మీరిక ఆవిషయం ఆలోచించకండి.

సుబ్బయ్యా:—సెహభాష్ రాజన్నా! అదీ ప్రజ్ఞఅంటే! ఈనాటి నించి నువ్వే నేను, నేనే నువ్వనుకో! నాకున్నదానిలో ఇకముందునుంచి సగపాలు నీది. మొదటిబహుమానంగా ఈచేతిగడియారం తీసుకో! (గడియారంతీసి ఇస్తాడు. అడుగులచప్పుడు వినపడుతుంది) ఎవరోవస్తున్నట్లున్నారు. మెదలకుండా ఊరుకో!

రాజన్న:—(పరికించి) వెంకటస్వామి ఈవైపే వస్తున్నాడు!

సుబ్బయ్యా:—చూడూ! కాపలా దిట్టంగాపెట్టమను. లక్ష్మయ్యా పారిపోతే పీక ఎగిరిపోతుందని చెప్పు. రాష్ట్రిఅధ్యక్షుణ్ణి ఎవరూ చూడకుండా ముందు నువ్వేచూడు. నువ్వొచ్చాక ఇతగాడి భరతమూ పడదాం! వీడెక్కడికిపోతాడు వంటేంటి కుందేలు!

రాజన్న:—సరే! ముందుగా మీరు వెళ్ళిపొండి! (సుబ్బయ్యా ఎడమ ప్రక్కగా వెళతాడు)

రాజన్న:—ఏమయ్యో వెంకటస్వామీ! ఓమాటిలారా!

(వెంకటస్వామి వస్తాడు.)

వెంకటస్వామి:—ఏం! ఎందుకు?

రాజన్న:—చూడు! కాపలాదిట్టంగాపెట్టు. ఈరాత్రి ఎవరూ గ్రామం విడిచి బయటికి వెళ్ళవద్దని చెప్పు. తెలిసిందా!

వెంకటస్వామి:—అలాగే లేవయ్యా!

రాజన్న:—అలాగే కాదు ! అమలు జరిపి తీరాలి. చూడు నువ్వు ఈ గ్రామరక్షణదళాధిపతివి. నేను గ్రామ రైతుసంఘం ఉపాధ్యక్షుణ్ణి! నువ్వు నాకింద తాబేదారువన్న విషయం మరిచిపోకు. గ్రామంలోంచి పోతుటీగ బయటికిపోయినా నీదే జవాబుదారీ ఊఁ ! (వెళ్ళిపోతాడు.)

వెంకటస్వామి:—(అతడు వెళ్ళినవైపు చూస్తూ) కళ్ళు నెత్తిమీద కెక్కాయి. కానికూతలుకూస్తున్నాడు. ప్రశతిమించితే రాజీనామాచేసేస్తా ! (వెళ్ళబోతాడు.)

(ఇంతలో తాతయ్యలూ ముసలయ్యా వచ్చి కుడిపక్కగా వెళ్ళ బోతుంటారు)

వెంకటస్వామి:—ఎక్కడికి పోతున్నారయ్యా !

ముసలయ్య:—రైతుసంఘ కార్యాలయానికి.

వెంకటస్వామి:—ఎందుకు బాబూ.

తాతయ్యలు:—ఎందుకా ! భూమిపంపకానికి.

వెంకటస్వామి:—ఏమిటీ? భూమిపంపకమా ! చిత్రంగా ఉందే!

ముసలయ్య:—అవును. ఇందాక సమావేశంలో అధ్యక్షుడు వెంకటాద్రి చెప్పలేదటయ్యా ! కార్యాలయానికి రమ్మని.

వెంకటస్వామి:—ఏమిటీ ? అధ్యక్షుడు వెంకటాద్రా ! అతణ్ణెవరూ ఎన్నుకుంటూ? మొత్తం అరవైకి పైగా సభ్యులున్నారు. వారిలో పధ్నాలుగురుమాత్రమేకదా హాజరైనారు. అలాంటి పరిస్థితుల్లో ఇతడు అధ్యక్షుడెలా అవుతాడు ? అసలు ఎన్నిక ఎలా జరిగింది ?......

ముసలయ్య:—లక్ష్మయ్య ద్రోహిగా తేలాడు కదా !

వెంకటస్వామి:—ఇదంతా ఒక పన్నాగమయ్యా! ప్రస్తుతం ఇందులో లక్ష్మయ్య తగుల్కొన్నాడు. రేపు మీరుకూడా ఇలాగే

ఆపన్నాగంలో తగుల్కోకుండా చూసుకోండి. మెలుకువ తెచ్చుకొని......

ముసలయ్య:-అబ్బే! మేం అంతవెర్రివాళ్ళం కామయ్యోయ్! అలా చిక్కుకోడానికి. సుబ్బయ్యభూములు పంచితే పుచ్చుకుంటాం. లేకపోతే లేదు. మాకేం మధ్యన?

వెంకటస్వామి:_సరే. ముందుగా దీనికి సమాధానం చెప్పు. సుబ్బయ్య కిరాతకు డవునా?_ కాదా?._

ముసలయ్య:_స్వార్థపరుడేమో కాని_కిరాతకుడని ఎలా అంటాం?

వెంకటస్వామి:_తాతయ్యలూ నువ్వు చెప్పు?

తాతయ్యలు:_ప్రవృత్తి మారిందయ్యా! మారే ప్రపంచాన్ని అర్థంచేసుకుని తానూ మారుతున్నాడేమో! ఎవరు చెప్ప గలరు?

వెంకటస్వామి:_అర్థం అయింది. మీరంతా బాగా తగుల్కొన్నా రయ్యా ఆ మాయలో! భూమి అనే ఎరచూపి మిమ్మల్ని మోసగించాడు సుబ్బయ్య. సరే, నిజం నిలకడమీద తెలుస్తుందిలెండి, వెళ్ళండి.

(ముసలయ్యా, తాతయ్యలూ వెళతారు. మరోవైపునుంచి పెదకాపు వస్తాడు.)

పెదకాపు:-వెంకటస్వామీ! నీకోసు గ్రామంఅంతా గాలిస్తున్నా నయ్యా!)

వెంకటస్వామి:_ఎందుకు?

పెదకాపు:_ఏముంద మనలక్ష్మయ్యసంగతి......

వెంకటస్వామి:_(ఆత్రుతతో) ఏమైందేమిటి అతడికి?

పెదకాపు:_లక్ష్మి భోజనం తీసుకువెళ్ళిందట. సమావేశవివరాలు చెప్పేసరికి, భోజనం విసిరికొట్టి వెంకటస్వామిని వెంటనే తీసుకురమ్మని చెప్పాడట.

వెంకటస్వామి:_అంతజరుగురు దేనికో! ఎందుకైనా మంచిది ఇప్పుడే వెళ్ళొస్తాను.

పెదకాపు:-తొందరపడకయ్యా! నిన్ను కబురుచేసింది రాష్ట్రిఅధ్య క్షుణ్ణి వెంటనే తీసుకురమ్మని చెప్పడానికి. తనమీదే కాక రైతుసంఘం నాశనానికే కుట్రజరుగుతుందని అతడి అభిప్రాయం. ఈ ఈవిషయం ఆయనకి చెప్పి ద్రోహుల్ని వెంటనే శిక్షించాలని, లేకపోతే గ్రామానికే ముప్పు వస్తుందని అతగాడి భయం. మరి వస్తా.

వెంకటస్వామి:-ఒక్కక్షణం ఆగు పెదకాపూ! నేనూ, రాష్ట్రిరైతు సంఘాధ్యక్షుడికి కబురుచేయాలనుకున్నా కాని ప్రస్తుతం ఆయన ఎక్కడ ఉన్నారో నాకు తెలియదు.

పెదకాపు:_ప్రస్తుతం అతడు "మాలవానిపల్లె"లో ఉంటాడని లక్ష్మయ్య భార్యతో చెప్పాడట! మరి వెళ్తానయ్యా!

వెంకటస్వామి:_నువ్వే ఆయనదగ్గరికి వెళ్ళివస్తే మంచిదనుకుంటా నయ్యా! ఈమాత్రం సహాయం చేద్దూ సంఘానికి!

పెదకాపు:_నేను సమావేశంలో లేను. అంచేత వివరాలు అత గాడితో సరిగాచెప్పలేను. అదీకాక రాత్రికి కాపలా వంతునాది. అంచేత నేను వెళ్ళడం వీలుపడదు. మరెవరి నైనా పంపించు.

(పెదకాపు కుడిప్రక్కగా వెళతాడు. ఎడమప్రక్కనుంచి సీతన్న వస్తాడు. వెంకటస్వామి వెళ్ళబోతుంటాడు.)

సీతన్న:—ఎక్కడికయ్యా వెంకటస్వామీ ?

వెంకటస్వామి:—ఏం సీతన్నా! ఇలా వచ్చావు? తొందరగా రాష్ట్ర సంఘాధ్యక్షుణ్ణి తీసుకురావడానికి వెడుతున్నా !

సీతన్న:—అయితే నువ్వు వెళ్ళక్కర్లేదులే !

వెంకటస్వామి:—ఏం ?

సీతన్న:—నేనే అతణ్ణి తీసుకువచ్చాగా !

వెంకటస్వామి:—హాస్యమాడుతున్నావా సీతన్నా ?

సీతన్న:—నిజమేనయ్యా !

వెంకటస్వామి:—(ఆశ్చర్యంతో) ఆయన్ని ఇంతత్వరలో ఎలా తీసుకురాగలిగావ్ ? ఉద్దండుడిలా ఉన్నావే ?

సీతన్న:—లక్ష్మయ్య ద్రోహి అని వారు నిర్ధారణచేసేసరికి నాబుర్ర గిర్రున తిరిగింది. ఎందుకైనా మంచిదని వెంటనే "మాలవానిపల్లె" వెళ్ళి ఆయన్ని సరాసరి తీసుకువచ్చా !

వెంకటస్వామి:—ఆయన ఇప్పుడు ఎక్కడ బసచేశారో త్వరగా చెప్పు ? నేను వెళ్ళి జరుగురుగా మాట్లాడాలి.

సీతన్న:—తొందరలేదులే ! ఆయన ఇక్కడికే వస్తానన్నారు. (అడుగులచప్పుడూ, మాటలధ్వనీ వినపడుతుంది) అదిగో మాటలోనే వస్తున్నారు.

(రాష్ట్రరైతుసంఘాధ్యక్షుడూ, నలుగురురైతులూ ప్రవేశం.)

వెంకటస్వామి:—నమస్కారమండీ వెంకన్నగారూ !

వెంకన్న:—నమస్కారం.

వెంకటస్వామి:—మీరుసమయానికి రావడం చాలామేలయింది. గ్రామంలో కుట్రలు జోరుగా సాగుతున్నాయి. మన లక్ష్మయ్య ఇంట్లో తుపాకీగుళ్ళు అదిగో ఆకన్పిస్తున్నకట్టెల మోపులో ఎవరోదాచి, అనవసరంగా అతగాడిమీద నిందమోపారు.

సీతన్న:—చూడండి! అక్కడే సమావేశం ఏర్పరిచారు. అంతా ఒక నాటకంలా జరిగిపోయిందంటే నమ్మండి. తమరే విచారించి న్యాయం తేల్చాలి.

వెంకన్న:—మీరంతా జరిగిందేదో చెప్పుతున్నారు కాని రాజన్నను తీసుకురావడానికి ఒక్కరూ వెళ్ళరేం ?

వెంకటస్వామి:—(ఇకరైతువైపు చూస్తూ) చూడు! నువ్వే వెళ్ళి రాజన్నను తీసుకురా! వెంకన్నగారు వచ్చారనిచెప్పు.

రైతు:—సరేనయ్యా! (వెళతాడు.)

రెండోరైతు:—భూస్వామి సుబ్బయ్యగారు మాకందరికీ భూదానం చేస్తామన్నారు బాబూ!

వెంకన్న:— భూము లిస్తాడా! భూములు ? అసలు ఈ భూములు ఎవరివని అతడి అభిప్రాయం ?

మూడోరైతు:—ఇంకా అతడిదగ్గర మిగిలిన భూములు పంచుతాడట.

వెంకన్న:—(వెటకారంగా) పంచుతాడా! పంచుతాడు. పంచక ఏం చేస్తాడు ? ఎప్పుడైనా తాను తన స్వహస్తాలతో పొలం దున్నాడా ఈ మొనగాడు ?

సీతన్న:—నిజమే బాబూ! జన్మంలో నాగలి ముట్టుకున్న పాపాన పోలేదు ఈ సుబ్బయ్య!

నాలుగోరైతు:—ఏదీ ఒక్కరోజు దున్నమను తెలుస్తుంది!

సీతన్న:—సుబ్బయ్య ఈగ్రామ అధికారిగా ఉన్నప్పుడు రైతుల రక్తం త్రాగాడు. అన్యాయంగా అందరి భూములూ ఆక్రమించుకున్నాడు. ఈ దౌర్జన్యం ఎదుర్కోడానికి ఆనాడు రైతాంగానికి దమ్ములు లేకపోయినై మరి......

మూడోరైతు:—మాతాత అంటూంటాడు మూడు తరాలక్రితం సుబ్బయ్య పూర్వీకులు మనగ్రామం వడ్డీవ్యాపారస్థులుగా వచ్చారట. కాలక్రమేణా ఈగ్రామలలోని భూములన్నింటికీ అధికారులయిపోయారట! రైతులకు రుణాలిచ్చి, ఎక్కువ వడ్డీలుకట్టి, రైతు అప్పు సకాలంలో చెల్లించకపోతే భూములు వేలంవేయించి వారే పాడుకొనేవారట! ఇలా అన్యాయంగా ఈఆస్థినంతా సంపాదించారు. ఈనాడు పేదవాళ్ళమైన మనం అహోరాత్రాలూ ఎండనకా, వాననకా, పొలాల్లో పడి పంటలు పండిస్తే, కాలుమీద కాలేసుకొని బొజ్జలు నింపుకుంటున్నారీ భూస్వాములు. మనం భూములు దున్నకపోతే బంగారు భూములు బంజరు బీడులు కావలసిందే! ఈభూస్వాములు రాబందుల్లా రైతాంగాన్ని పీక్కు తింటున్నారు. ఈ అన్యాయం మనం ఇకఅరికట్టాలి. రైతుహక్కు నిలపాలి. దున్నేవాడికే భూమి. ఈ సిద్ధాంతంకోసం అవసరమైతే మనం ప్రాణాలు అర్పించడానికి వెనుదీయకూడదు. ఏమంటారు ?

గుంపులంతా:—ఓ! రైతుహక్కుకోసం పోరాటం సాగించడానికి మేం తయార్! నడుంబిగించి సిద్ధంగాఉన్నాం.

వెంకన్న:—భూస్వాములికే భూమి చెందనప్పుడు, వారు భూమి పంచడం ఏమిటి? మనం పుచ్చుకోవడం ఏమిటి? వీరంతా సంఘానికి చీడపురుగులు. దేశద్రోహులు అభివృద్ధినిరోధకలు. ఎవరు దోపిడీదారులో తేలాలి ఇప్పుడు !

నాల్గవరైతు:—అర్థం అయింది బాబూ! మనం భూమిదున్నాం. మన భార్యాబిడ్డలు రాత్రీపగలూ పొలాలమీద కష్టపడ్డారు. భూమి మనకే చెందాలి.

వెంకన్న:—ఇది విశ్వసత్యం. ఈనాడు కాకపోతే రేపైనా "దున్నేవాడిదే భూమి" అన్న రైతుహక్కు సిద్ధాంతాన్ని అంగీకరించక తీరదు.

సీతన్న:—అయితే మనం అందరం సుబ్బయ్యతో భూములకు పట్టాలురాసి ఇమ్మనిచెప్పాలి.

వెంకన్న:—అలా ఇవ్వకపోతే మీరెవరూ భూములు పుచ్చుకోకూడదు.

సీతన్న:—ఏం ! ఎందుకు పుచ్చుకోకూడదు ?

వెంకన్న:—ఆయన ఇంకా పంటలో కొంతభాగం తనకివ్వాలంటున్నాడు కూడాను. అంటే ఇంకా తనకు భూమిపై అధికారం ఉందని రుజువు పరుచుకోడానికేగా !

సీతన్న:—మనం పంటఏమీ ఇచ్చేదిలేదని చెబుదాం. అవసరమైతే మనరైతుసంఘంద్వారా పోరాడుదాం.

వెంకన్న:—సీతన్నా! నువ్వింకా పెరటితోవలో ఉన్నావ్. రైతుసంఘం ఇప్పుడు రాజన్నచేతుల్లో ఉన్నట్టు తెలిసిందానీకు.

రాజన్నా, సుబ్బయ్యా ఈకుట్రలో భాగస్వాములు. వారి కుట్రఫలితంగా లక్ష్మయ్య ద్రోహిగా తేలాడు. తెల్సా ?

సీతన్న:—ఏమో బాబూ ! ఇదంతా ఇంద్రజాలంలాఉంది. ఆసుబ్బయ్య ఒప్పందం ప్రకారం నాకు రావలిసినపంట ఇంకా ఇవ్వలేదు. ధాన్యం తోలించుకురావడానికి తన బళ్ళు ఇస్తానని చెప్పి అదీ ఎగేశాడు. ఇదంతా చూస్తే వాళ్ళు ఎదోకుట్రచేస్తున్నట్లే ఉందయ్యా !

వెంకన్న:—అదే మనవెనుక జరుగుతున్నది. లోగడ మనం సుబ్బయ్యను క్షమించి విడిచాం. అదే ప్రమాదించింది. ఇదికాక రాజన్నలాంటి ద్రోహులు స్వార్థం కోసం భూస్వాముల గులాములై రైతుసంఘానికి ముప్పుతెస్తున్నారు. ఈసారి అమీ తుమీ తేల్చుకొని వెళ్లాలనే ఇక్కడికి వచ్చాను. తేలిస్తేనే కానివెళ్ళను.

సీతన్న:—ఈసారి ఈనీచునికి ఒకగుణపాఠం నేర్పివెళ్ళు బాబూ ! నీపుణ్యం ఉంటుంది.

గుంపుఅంతా:—అవును. అలాచేయండి బాబూ ! లేకపోతే మన నాశనాన్ని మనమే కొనితెచ్చుకుంటాం.

(మొదటిరైతు వస్తాడు.)

సీతన్న:—ఏం ! రాజన్న కన్పించాడా ? రమ్మని చెప్పవా ?

మొదటిరైతు:—రాజన్నఇంటికి వెళ్ళా. లేడన్నారు. ఊహించి సుబ్బయ్య ఇంటికివెళ్ళా. గదిలో గుసగుసలూ, నవ్వులూ వినవచ్చాయి. పొంచి విన్నా. 'లక్ష్మయ్యపీడ విరిగింది తుపాకీగుళ్ళతో. రైతుసంఘం మనచేతిలో పడింది. ఇహ

మనం ఆడిందిఆట, పాడిందిపాట. ఇకముందు మనకు లాభించేదానిలో చెరిసగం అని సుబ్బయ్యా రాజన్నలు మాట్లాడుకుంటున్నారు. ఇది విని వెంటనే మీాకు మనవి చేద్దామనీ వచ్చేసా ! ఇది బాబూ సంగతి...

వెంకన్న:—శ్రుతిమించి రాగానపడుతున్నది. ఈదుర్మార్గుల్ని ముందు శిక్షించాలి. వెళ్ళి పిలుచుకురండి.

(అడుగులచప్పుడు వినపడుతుంది అందరూ ఆవైపుచూస్తారు.)

వెంకటస్వామి:—అదిగో వాళ్ళే ఈవైపు వస్తున్నారు.

వెంకన్న:—సరే ! మనకేమిా తెలియనట్లు నటిద్దాం. వారేంచెపు తారో విందాం. మీాలో ఒకరు వెళ్ళి లక్ష్మయ్యను తీసుకురండి.

(రెండోరైతువెళతాడు "ఏం ! వెంకటస్వామీ నువ్వింకా ఇక్కడే ఉన్నావా ? కాపుదార్లను నియమించావా ?" అన్నమాటలు విన పడుతవి. రాజన్నా, సుబ్బయ్యా ఒకరి తర్వాత ఒకరు వస్తారు. వెంకన్నను చూచి నిశ్చేష్టులౌతారు.)

రాజన్న:—నమస్కారం వెంకన్నగారూ, ఎప్పుడు రాక ?

వెంకన్న:—నమస్కారం రాజన్నా ! చాల తొందరపనిలో ఉన్న ట్టున్నావ్ !

రాజన్న:—అవును. మాసూలు సమయం కాదూ ! రైతాంగానికి కావలసిన సదుపాయాలు చూస్తున్నా.

వెంకన్న:—బాగుంది.

సుబ్బయ్య:—నమస్కారం వెంకన్నగారు !

వెంకన్న:—నమస్కారం సుబ్బయ్యగారూ ! మీారు మీాభూమి నంతా రైతాంగానికి ఉచితంగా దానం చేస్తున్నారటగా!

సుబ్బయ్య:—అవునండీ. ఒకప్పుడు నేను రైతాంగాన్ని కాల్చుకు తిన్నా. క్రమేణా నాతప్పు నేను తెలుసుకున్నా. దున్నే వాడికే భూమి చెందాలి అని అనుకున్నా. ఈనాటినుంచీ నేనుకూడా మీలో ఒకణ్ణి. ఏమంటారు? ఒక్కమాట, రేపు తమరు మాయింటికి భోజనానికి రావాలి. తమకు కావలసిన వంటకాలు చేపా, మాంసం వగైరా వండిస్తా.

వెంకన్న:—మీఆదరణకు నేను కృతజ్ఞుణ్ణి. కాని నేను శాఖా హారినండి.

సుబ్బయ్య:—ఓహో! అలాగా! గత ఐదేండ్లనుంచే నేనూ శాఖా హారిగా మారిపోయాలెండి. చుట్టవ్యసనంకూడా మాను కున్నా. నైతికపంథాలో జీవితం నడుపదలిచా.

వెంకన్న:—(వెకిలిగా) నైతికపంథా!

సుబ్బయ్య:—అవును పరంపరాగతమైన ఆర్యధర్మాలను అనుసరిస్తూ జీవితశేషాన్ని గడుపదలిచానండీ వెంకన్నగారూ!

వెంకన్న:—(సాభిప్రాయంగా) సెహబాష్! కల్లాకపటం లేకుండా జీవితంసాగింపదలచడం మా రైతాంగం అదృష్టం! సరే మంచిది. (రాజన్నవైపుచూచి) రాజన్నా! ఈకొత్త కోటు ఎక్కడిదోయ్? మహాబావుంది.

రాజన్న:—రాత్రుళ్ళు చలిజోరుగాఉంది కదూ! చౌకీదార్లకు చలి బాధ నివారణకోసం కోట్లుకొన్నాం!

వెంకన్న:—అయితే అది నువ్వెందుకు వేసుకున్నావ్!

రాజన్న:— ఎలాగుంటుందో చూడాలని బుద్ధిపుట్టి ఈదినమే తొడిగా!

గుంపులంతా:—పచ్చిఅబద్ధం. కొన్నాళ్ళటినుంచీ అతగాడే తొక్కుకుంటున్నాడు.

(రాజన్న తలవంచుకు నిలబడతాడు.)

వెంకన్న:—అది తీసి చౌకీదార్లకు ఇచ్చేయ్ !

(రాజన్నకోటు తీసివేస్తుంటాడు.)

వెంకన్న:—రాజన్నా ! నీచేతిగడియారం చాలాబాగుందే ! ఎలా సంపాదించావ్ ?

రాజన్న:-(భయంతో) ఒకరు ఇచ్చారు. డబ్బు ఇంకా ఈయలేను. త్వరలోనే ఇచ్చేద్దా మనుకుంటున్నాను.

వెంకన్న:—సరే ! రైతుసంఘం ఎలా ఉంది ?

రాజన్న:—ఏం చెప్పడానికి ఏంఉంది ! సభ్యులు సరిగా చందాలు ఈయడంలేదు. కార్యవర్గసభ్యులు కార్యాలయాలకి రారు. గ్రామరక్షణదళాధిపతి నామాట వినడు. సరే! ఇక కలలో కూడ అనుకోని సంఘటన జరిగింది. లక్ష్మయ్య జమిందారీ ముఠాతో వాళ్ళ మావద్వారా సంబంధంపెట్టుకొని రైతాంగాన్ని నాశనంచేయడానికి నిశ్చయించుకున్నాడు. ఇదిగో ! అతడిఇంట్లో దొరికిన తుపాకీగుళ్ళు. (కోటు జేబులోని గుళ్ళుచూపించి) నేనేకాదు, అందరూ చూశారు స్పష్టంగా......

వెంకన్న:—ఈవిషయం స్వయంగా ఎవరైనా చూచారేమో చెప్పండి.

రాజన్న:—మీరు ఈవిషయమై దర్యాప్తు జరిపించండి. (గుంపువైపుతిరిగి) చెప్పండయ్యా! మీరేం చూసారో !

గవరయ్య:—ఒక్క విషయం చెప్పయ్యా! రాజన్నా! తుపాకీగుళ్ళు కట్టెమోపులోనే ఉన్నట్లు నీ కెలా తెలిసింది?

రాజన్న:—నాకు తెలియదే!

గవరయ్య:—అయితే నేను లోపలికి వెతకడానికి వెళుతుంటే అడ్డు పెట్టి బయట వెదకమని చెప్పావుకా! దాన్నిబట్టి గుళ్ళు మోపులోనే ఉన్నాయని నీ కిదివరకే తెలుసునని నాఅభిప్రాయం.

రాజన్న:—ప్రమాణకంగా చెపుతున్నా! నా కేవిషయం తెలియదు. ఆకాశరామన్న ఉత్తరంబట్టి సోదాచేయమన్నా! అందరూ లోపలే వెతకడం దేనికని నిన్ను బయట వెదకమన్నా! అంతే!

వెంకన్న:—ఏదీ ఆఉత్తరం?

రాజన్న:—నేను అబద్ధం ఎందుకు చెపుతాను. ఇదిగో ఉత్తరం. (కోటుజేబులోని ఉత్తరం తీసి అందిస్తాడు.)

వెంకన్న:—(ఉత్తరం చదువుకుని) ఇది ఆకాశరామన్న ఉత్తరం. ఇందులో తుపాకీగుళ్ళు ఎక్కడఉన్నవో రాయలేదే! అదీకాక కట్టెలమోపు గుడిసెబయట ఉంది. ఎవరైనా కిట్టనివాళ్ళు లక్ష్మయ్యపై ద్వేషంతో తుపాకీగుళ్ళు దాచి ఉంచి ఇలా రాసిఉండవచ్చు.

రాజన్న:—కట్టెలమోపు కిటికీదగ్గరే ఉంది. ఎవరైనా వచ్చి తుపాకీగుళ్ళు దాస్తే ఆ అలికిడి వాళ్ళకి వినిపించదా?

వెంకన్న:—లక్ష్మయ్య రైతుసంఘం పనిమీద బయటికి పోయి ఉండవచ్చు. లక్ష్మి ఇంట్లో లేకపోవచ్చు. ఆసమయం కనిపెట్టి ఎవడో తుంటరి ఈపని చేసిఉండవచ్చు. ఎందుకు కాకూడదు అలా, రాజన్నా!

మొదటిరైతు:—అలాగే జరిగి ఉండవచ్చు.
రెండవరైతు:—దీనికి వెనుక చాలాతతంగం ఉండిఉంటుంది.
మూడవరైతు:—ఈవిషయం రాజన్నకు విపులంగా తెలిసే ఉండవచ్చు.
రాజన్న:—మీరు నిరపరాధిని నిందిస్తున్నారు. నేను ప్రమాణం చేసి చెప్తున్నా......
నాల్గవరైతు:—ప్రమాణంవల్ల ప్రయోజనం ఏమిటి ? ప్రమాణాలు సమస్యల్ని పరిష్కరించవు. ప్రమాదం తప్పించుకోడానికయ్యా ఈ ప్రమాణాలు. నమ్మకండి...
వెంకన్న:—అసలు మనం నేలవిడిచి సాముచేస్తున్నాం ! లక్ష్మయ్య ఏడీ అసలు ?

(ఇంతలో లక్ష్మయ్యా, లక్ష్మి, కొంతమంది రైతులూ వస్తారు.)

లక్ష్మయ్య:—వెంకన్నగారికి నావందనాలు.
వెంకన్న:—(లక్ష్మయ్యచేతికి త్రాళ్ళుకట్టిఉండడంచూసి కోపంతో) ఇతడి చేతులు విప్పండి !

(ఇంతలో వెనుకఉన్న సుబ్బయ్య మెల్లిగా జారిపోడానికి ప్రయత్నిస్తుంటాడు. అది కనిపెడతాడు సీతన్న.)

సీతన్న:—సుబ్బన్నా జారిపోకు. ముందుంది ముసళ్ళపండుగ.
సుబ్బయ్య:—అబ్బే జారిపోవడం లేదే! (వెకిలినవ్వుతో) లక్ష్మయ్య చేతులు విప్పడానికి వస్తున్నానయ్యా !
లక్ష్మి:—వెంకన్న బాబూ ! మాకు చాల అన్యాయం జరిగింది. పాలముంచినా, నీళ్ళముంచినా నీదేభారం.
లక్ష్మయ్య:—ఈవూరు రైతుసంఘంమీదయినా ముందుగా నేనే దీనికి గురికావలసివచ్చింది.

వెంకన్న:—మరేం పర్వాలేదయ్యా! ఏం అమ్మా! నువ్వు గుడిసె లోంచి బయటికి వెళ్తున్నప్పుడు ఎవరినైనా చూశావా?

లక్ష్మి:—ఆఁ! సుబ్బయ్యగారిని చూచా!

సుబ్బయ్య:—బాగుంది. ఇంట్లో ఉక్కగా ఉంటే అలా బయటికి పోయివద్దామని ఇటువైపు వచ్చా అంతే! ఇంతమాత్రానికే ఈకుట్రతో నాకు సంబంధం పెట్టదలిచారా? అయినా! నిప్పుకి చెదపడుతుందా! లక్ష్మయ్యగుణం మనకి తెలియందా? ఎవరో కిట్టనివాడు ద్వేషంతో ఈనీచపుపని చేసిఉంటాచ్చు. అయ్యా! వెంకన్నగారూ! లక్ష్మయ్య నిర్దోషి. ఆయన్ని విడిచిపెట్టి గ్రామానికి ఉపకారంచేయండి.

వెంకన్న:—సరే! అలాఅయితే దీనికి గ్రామంప్రజ అంతా అంగీకరిస్తారా?

సుబ్బయ్య:—దీనికి ఎవరూ ఎదురుచెప్పరు.

లక్ష్మయ్య:—సుబ్బయ్యగారూ! మీరు చాలా తెలివైనవారు. మీరు నన్ను క్షమించమన్నా నేను ఒప్పుకోను. నేరం రుజువుకావాలి. దోషి శిక్ష అనుభవించాలి.

గుంపుఅంతా:—అవును. తుపాకీగుళ్ళు ఎలావచ్చాయో, ఎవరు దీనికి కారకులో తేలాలి!

వెంకన్న:—బేష్! బాగుంది. మంచి, చెడ్డా తెలుసుకోవాలి.

(ఇంతలో తెరలో కలవరం. కేకలు అంతా వింటూంటారు.)

ఒకరు:—భూమి నాకు అక్కర్లేదు.

రెండవవారు:—ఎందుకు అక్కర్లేదు?

ఒకరు:—ఇష్టంలేదు కనుక.

రెండవవారు:—అయితే రాజన్న దగ్గరికి నడు.

రాజన్న:—నేవెళ్ళి ఆగొడవేంటో చూసివస్తా.

వెంకన్న:—అక్కర్లేదు. వాళ్ళే వస్తారు.

(తిరిగి తెరలో కేకలు వినబడుతవి.)

ఒకరు:—అయితే నడు. నాకేం భయమా ? సుబ్బయ్యా కిరాతు కుడు. వేలాది రైతుకుటుంబాలు నాశనంచేశాడు. వాడి భూమి నాకు అక్కర్లేదు.

(లచ్చాన్నా, వెంకటాద్రి ఒకరిపై ఒకరు కోపంతో ప్రవేసిస్తారు.)

వెంకన్న:—ఈగొడవంతా ఏమిటి ?

రాజన్న:—(వెంకన్నతో) ఈగొడవంతా నేచూస్తాగా ! ముందా విషయం కానీయండి !

లచ్చన్న:—అలాకాదు ! ఇప్పుడీ విషయం అంతా తేలిపోవాలి.

(సుబ్బయ్యా జారిపోతాడు. అందరూ చూస్తారు.)

వెంకన్న:—వెంకటస్వామీ ! సుబ్బయ్యాని పట్టుకొని తీసుకురా !

(వెంకటస్వామి వెళతాడు.)

లచ్చన్న:—బాబూ ! నాగొడవ తమరు వినాలి. చాలకాలంబట్టి మనవి చేయాలనుకుంటున్నా.

వెంకన్న:—చెప్పయ్యా !

లచ్చన్న:—బాబూ ! భయపెట్టి నాచేత సుబ్బయ్యా వెట్టిచాకిరి చేయించుకున్నాడు. రాత్రింబగళ్ళు గొడ్డులాగ కష్టపడి పనిచేసా. ఆరోగ్యంచెడి మంచానపడ్డా. నాపెళ్ళాం బియ్యపు గింజలుకోసం సుబ్బయ్యా ఇంటికి వెళ్ళింది. కాని కిరాతకుడు

బియ్యం ఇవ్వడానికి మూరు ఆమెతో సరసాలకు దిగి,నాకు విడాకు లిమ్మని సలహా ఇచ్చాడట...

వెంకన్న:—విడాకులా !

లచ్చన్న:—అవునుబాబూ ! దానికి నాభార్య "చిలకాగోరింకల్లా కాపురం చేసుకుంటుంటే విడాకులిమ్మని చెప్పడానికి నీజిమ్మ ఎలావచ్చింది" అని తూలనాడిందట. దానికి అతగాడు కసీసం తన ఉంపుడుకత్తెగానైనా ఉండమన్నాడట. దాంతో నాపెళ్ళాం నాల్గుచీవాట్లువేసి వచ్చేస్తుంటే అడ్డుకోని బలాత్కరించి మానభంగంచేశాడట! ఈ విషయం అంతా నాతోచెప్పుకొని లోలోన కుమిలికుమిలి ఆ అవమానాన్ని భరించలేక ఆరాత్రే నూతిలోపడి ఆత్మహత్యచేసుకుం దది. ఇంతచేసి, పైగా ఆమె ఆత్మ హత్యకు నేనే కారణం అని నన్ను ఆరుమాసాలు ఖైదులో వేయించాడు బాబూ, ఈనీచుడు. ఇలాంటి నీచుడిభూమి నాకెందుకు? మీరే చెప్పండి బాబూ!

వెంకన్న:—వెంటనే జరిగింది ఎందుకు చెప్పలేదు, అందరితో ?

లచ్చన్న:—జరిగింది చెపితే నన్ను చిత్రవధచేస్తానన్నాడు. ఈ మాటలు రాజన్నా, వెంకటాద్రీ, కూడా విన్నారు బాబూ ! చెప్పవయ్యా ! వెంకటాద్రీ, ఇప్పుడుకూడా భయందేనికి ?

వెంకటాద్రి:-అవును.అప్పుడు నేను పరధ్యానంగాఉన్నా. సుబ్బయ్య ఏం అన్నాడో నాకు గుర్తులేదు కాని రాజన్నమాత్రం బెదిరించాడు.

రాజన్న:—ఏదో గొడవపడ్డారు కాని ఈమాటలు అన్నానో లేదో నాకు జ్ఞాపకంలేదు. వెంకటాద్రీ! నేనేదో బెదిరించానని చాల అన్యాయంగా నన్ను అంటున్నావ్. ఇదంతా చూస్తూంటే నువ్వో సుబ్బయ్యో నామీద ఏదో కుట్ర పన్నుతున్నట్లు కన్పిస్తున్నాది.

వెంకటాద్రి:—(రెచ్చిపోతాడు) కుట్రా! కుట్ర! కుట్రచేసింది నువ్వా? నేనా? నేను రైతుసంఘం అధ్యక్షుడిగా ఉండ వని నీకుచెప్పలేదూ! నువ్వేకా నన్ను బలవంతంగా పెడతా.

గుంపులంతా:—అసలువిషయం సవిస్తరంగా చెప్పరాదూ!

వెంకటాద్రి:—రైతుసంఘ విషయాలన్నీ తానే చూసుకుంటా ననిన్నీ, కార్యాలయం సుబ్బయ్యగారింట్లో పెడితే అద్దె ఖర్చు తప్పుతుందనీ, తన్నడగకుండా ఏపనీ చేయవద్దనీ కూడా చెప్పాడు.

వెంకన్న:—అయితే రాజన్న రైతాంగాన్ని మోసంచేద్దాం అను కున్నాడన్నమాట.

వెంకటాద్రి:—అంతేకాదు. ఎవరైనా ఎదురుతిరిగితే పట్నంనుంచి పోలీసుల్ని పిలిపించి దొంగకేసులు బనాయించి ఖైదులో పెట్టిస్తానన్నాడు బాబూ!

రాజన్న:—ఇదంతా పచ్చిఅబద్ధం. నేనలాంటి వాణ్ణికాను.

(ఒకరైతు వస్తాడు.)

ఒకరైతు:—సుబ్బయ్య గ్రామంలోంచి పరారీకావడానికి ప్రయ త్నించాడు. కాని పట్టుకున్నాం. తుపాకీగుళ్ళ సంగతి అడిగితే అదంతా రాజన్నకే తెల్సునని అన్నాడు.

రాజన్న:—బాగుంది. ఈకుట్రలో నన్ను ఇరికిద్దామని చూస్తున్నట్లు న్నారు మీరంతా !

వెంకన్న:—రాజన్నా ! ఇంకా ఎందుకు దాస్తావ్ ! అంతా తెలిసి పోయింది. ఇదుగో ఇందాక, నువ్వూ సుబ్బయ్యాగదిలో మాట్లాడుకున్న విషయా లేమిటో అంతా సవిస్తరంగా చెప్పు. నీతప్పు ఒప్పుకుంటే నిన్ను క్షమిస్తా ! అబద్ధం ఆడేవా నీఅంతు కనుక్కొంటా !

గుంపుఅంతా:—అవును చెప్పితీరాలి.

రాజన్న:—(లక్ష్మయ్యా కాళ్ళమీదపడి ఏడుస్తో) నీకు ద్రోహం తల పెట్టా లక్ష్మయ్యా ! క్షమించమని అడగటానికి కూడా నోరు రావడంలేదు. (లేచి చేతికట్లు విప్పి కన్నీళ్ళతో నిలబడతాడు.)

లక్ష్మయ్య:—రాజన్నా! నువ్వు ద్రోహం తలపెట్టావన్న చింత నాకు లేదు. నాద్రోహకారణంగా గ్రామమే నాశనమయ్యేది. ఇదంతా చేయమని నిన్ను ప్రేరేపించింది సుబ్బయ్యే కదూ !

రాజన్న:—అవును. అతడే తుపాకీగుళ్ళు నీగుడిసెదగ్గిర వంటకట్టెల మోపులో దాచాడు. అతగాడే నిన్ను తొలగించి మరెవరి నైనా అధ్యక్షుడిగా పెట్టి, వెనుకనుంచి తాను నాటకం ఆడాలని ఈకుట్రఅంతా పన్నాడు. దానికి నేను సంపూర్ణంగా సహాయపడ్డా. ఇది నేను చేసిన ద్రోహం.

లక్ష్మి:—(రాజన్నతో) ఈకుట్రలో మానాన్నను కూడా ఇరికించాలని ప్రయత్నించావ్ నీచుడా !

రాజన్న:-బుద్ధి గడ్డితిందమ్మా లక్ష్మీ! ఒప్పుకుంటున్నానుగా! సుబ్బయ్య తియ్యటికబుర్లలో పడి ద్రోహం తలపెట్టా! క్షమించండి అంతా!

వెంకన్న:-ఇదంతా చేస్తే నీ కేంముట్టచెపుతానన్నాడు?

రాజన్న:-ఇప్పటికి ఈచేతిగడియారం ఇచ్చాడు. సర్వాధిపత్యం తనకి వస్తే, లభించేదానిలో చెరిసగం పంచుకుందా మన్నాడు.

(వెంకటస్వామి, సుబ్బయ్య వస్తారు.)

వెంకటస్వామి:-నువ్వు ఎక్కడికిపారిపోయినా పట్టుకు తీసుకు రాగలం. తెలుసా!

సీతన్న:-ద్రోహీ! నువ్వు విషసర్పంలాంటివాడివి. నీకు రెండు నాలుకలు. నక్కవినయాలు ఎన్నో చూపించావ్. నిన్ను నమ్మాం. కానీ నీకడుపులో ఇంతకుట్ర ఉందని తెలుసుకో లేకపోయాం. రైతుసంఘాన్ని నీచేతి కీలుబొమ్మగా చేయాలనుకున్నావ్. లక్ష్మయ్యకు తీరనిద్రోహంచేశావ్. నీచుడా! నిన్ను ముక్కముక్కలు తరిగినా పాపంలేదు!

గుంపులంతా:-నిజం అంతా ఇప్పుడైనా చెప్పు, లేకపోతే తెలుసా!

సుబ్బయ్య:-ఇక దాచినాప్రయోజనం లేదు. అంతా చెపుతా వినండి. రైతుసంఘం ధాటికి తట్టుకోలేక మీలో ఒకడిగా నటించా. భూములు ఇచ్చినట్లు నటించి మిమల్ని నమ్మించా. నాదారికి అడ్డువస్తున్న లక్ష్మయ్యను, వెంకటస్వామిని నాశనంచేసి, రైతుసంఘ అధ్యక్షుణ్ణి కీలుబొమ్మగా చేసుకోవాలని ఆశించా. ఎదురు తిరిగినవాళ్ళని కుట్ర

దారులుగా నిర్ధారణచేసి, తప్పుడు సాక్ష్యాలతో ఖైదులో వేయించి, గ్రామాన్ని నాస్వాధీనంలో ఉంచుకుని, నాభూములు నేను పొందాలనుకున్నా. రైతాంగానికి నమ్మకం కల్గడంకోసం, రాజన్నను లోంగదీసి అతడిద్వారానే ఎవరికీ అనుమానం కలగకుండా ఇదంతా సాధింపదలిచా.

వెంకన్న:—సుబ్బయ్యా ! నీలాంటి ద్రోహులు దేశానికి చీడపురుగులు. మీలాంటివారు ఎంత త్వరలో నాశనమైతే దేశానికి అంత మంచిది. సరే, నీకు తగినశిక్ష విధిస్తా. (గుంపునుచూసి) మీరంతా సుబ్బయ్య ఇంటిని సోదా చేయండి. మారణాయుధాలు ఉంటే తీసుకురండి. రాజన్నా ! నువ్వు మాలో ఒకడిగా ఉంటూ జమిందారీ ముఠాతో కలసి మమ్మల్ని నాశనం చేయదలిచావ్. నీ స్వార్థంకోసం గ్రామప్రజను బలిచేయ నిశ్చయించావ్. నీలాంటివారు సంఘానికి వేరుపురుగులు. మీలాంటి వారిని సమూలంగా ఏరెయ్యాలి. ఆనాడే లోకానికి శాంతి, రైతాంగానికి ప్రశాంతి. సుబ్బయ్యా! నీలాంటి భూస్వాములు ఎన్నిప్రయత్నాలుచేసినా పురోగమిస్తున్న రైతుశక్తిని, రైతుహక్కును అడ్డే శక్తిలేదని తెలుసుకో. రైతే రాజ్యానికిరాజు. శ్రామికుడే సారథి... ఈనగ్నసత్యాన్ని మీలాంటివారు ఎంతత్వరలో గ్రహిస్తే అంత మంచిది.

లక్ష్మయ్య:—సుబ్బయ్యా ! భూస్వాములయుగం అంతరించింది. ఇది రైతుయుగం. దున్నేవాడిదే భూమి అన్న రైతుహక్కును అంగీకరించి మారేకాలంతో మీలాంటివారు మారక

పోతే వర్గసంఘర్షణే. దేశంలో రక్తపాతమే. భూస్వాముల వినాశనమే. మీలాంటి భూస్వాములు భూమిని పేదరైతులకు పంచితేనే విశ్వశాంతి. లేనినాడు విలయతాండవమే. దేశక్షేమానికి ఇది అంతా గుర్తించి తీరాలి.

(సుబ్బయ్య తలవంచుకుని నిలబడతాడు.)

సీతన్న:—కుట్రఅంతా బయటపడింది. లక్ష్మయ్య నిరపరాధి అని తేలిపోయింది. రేపు రైతుసంఘ సమావేశాన్ని ఏర్పరిచి ద్రోహులకు తగినశిక్ష విధించాలి. ఏమంటారు ?

గుంపులంతా:—బాగుంది. అలాగే చేద్దాం.

వెంకన్న:-రైతుఉద్యమాలను విచ్ఛిన్నంచేయడానికి ప్రయత్నించడం అవివేకం అని ఇప్పటికైనా తెలుసుకోండి. పదండి. మన రైతుసంఘాలను ఇంకా పటిష్టంగాచేసుకొని "రైతు హక్కుల" కోసం పోరాడుదాం. దున్నేవాడిదే భూమి. రైతు సంఘానికి జై !

(అందరూ మెల్లిగానడుస్తారు. తెర పడుతుంది.)

సమాప్తం.

# దున్నేవాడిదే భూమి

భూస్వాముల యుగం అంతరించింది. ఇది రైతుయుగం. దున్నేవాడిదే భూమి. ఈ హక్కుని అంగీకరించి మారేకాలంతో మారకపోతే వర్గసంఘర్షణే. దేశంలో రక్తపాతమే. భూమిని పేదరైతులకు పంచితే విశ్వశాంతి ; లేనినాడు విలయతాండవమే. దేశక్షేమానికి ఇది గుర్తించి తీరాలి. రైతు ఉద్యమాలను విచ్ఛిన్నంచేయడానికి ప్రయత్నించడం అవివేకం. పురోగమిస్తోన్న రైతు శక్తినీ, రైతుహక్కునీ అడ్డేశక్తి లేదు. రైతే రాజ్యానికి రాజు ! శ్రామికుడు ! ! సారధి ! ! ! దీన్నే యీ నాటిక చిత్రించింది.



బి. వి యస్. పాత్రుఁడు: జననం 18-6-1926 విశాఖపట్నంలో.

కాకినాడ పిఠికాపురాధీశ కళాశాల యందును, బొంబాయి శ్రీ "తాతాఇనిస్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సు" సంస్థయందును విద్యాభ్యాసం. ఇతర రచనలు :— నిరుద్యోగి ; సందేశం ; వెన్నెల రాత్రి ; అశోకనరకం (నాటికలు.)సాహిత్య ప్రచారకసంఘు వ్యవస్థాపకుడు-నటుడు; కవి; కళాపిపాసి; ఉపన్యాసకుఁడు ; జ్యోతిష్కుడు ; సాముద్రికవేత్త.




పబ్లిషర్సు: అడ్డేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము